# సంస్కృత కావ్యసంగ్రహము



సంకలనకర్త:

ఆచార్య వేలూరి సుబ్బారావు, యమ్.ఏ., పిఎచ్.డి.




ఆంధ్రా యూనివర్సిటీ ప్రెస్సు, వాల్తేరు

విశాఖపట్నం 530 003

# తొలిపలుకు

ఆంధ్ర విశ్వకళాపరిషత్తు స్వర్ణోత్సవ సందర్భమున వెలువరింపబడిన సంస్కృతమునందలి సూక్తుల సంకలనము సంస్కృత శాఖచే కూర్పబడినదని ప్రకిటించుటకెంతయు ఆనందము కలుగుచున్నది. భారతీయ ప్రాచీన సంస్కృతికి విజ్ఞానమునకు సంస్కృత భాష స్వర్ణపేటిక. వేదకాలమునుండి నేటివరకు పండితులు సంస్కృతమున భావప్రకటనమేగాక గ్రంథరచనలనుకూడ చేయుచున్నారు. ఈ స్వర్ణోత్సవ సందర్భమున సంస్కృతభాషలో ప్రసిద్ధులైన మహాకవుల రచనలనుండి కొన్ని ఆణిముత్యములనదగు సూక్తులు ఆంగ్లమున, ఆంధ్రమున అనువదింపబడి రెండు భాగములుగ ప్రచురింపబడినవి. ఈ సూక్తులయందు కేవలము మృదుమధురమైన కవిత్వమేగాక ఉదారములైన భావములును పొందుపరచబడినవి. కనుక ఈ ప్రచురణలు పాఠకులకు సమ్మోదకరములేగాక విజ్ఞానదాయకములుగూడ కాగలవని నా ప్రగాఢ విశ్వాసము.

వాల్తేరు
8–11–1977

యమ్. ఆర్. అప్పారావు
ఉపాధ్యక్షులు
ఆంధ్ర విశ్వకళాపరిషత్తు

# ఆముఖము

ఆంధ్ర విశ్వకళాపరిషత్తు స్వర్ణోత్సవ సందర్భమున వేదభాగముల నుండియు కావ్యవాఙ్మయమునుండియు సేకరింపబడిన ఈ సూక్తి గుచ్ఛము ఉపకులపతులైన శ్రీ ఎం. ఆర్. అప్పారావుగారి అభిమతము ననుసరించి ప్రచురింపబడినది. ఇందు మహోన్నత విషయ స్ఫోరకములగు సూక్తులు - వేదవాఙ్మయమునుండియు, రఘువంశాది మహాకావ్యముల నుండియు సేకరింపబడినవి. కాల పౌర్వా పర్యమును దృష్టిలో నుంచుకొని విషయ విభాగము చేయబడినది. ఆరంభమున శ్లోకమునకు సంబంధించిన అవతారిక ఈయబడినది. శ్లోకములు తెలుగు లిపియందు వ్రాయబడినవి. తరువాత శ్లోకార్థమును, విశేషాంశములును పొందుపరచబడినవి. మొదట వేదవాఙ్మయమునుండియు తరువాత ఇతిహాసముల నుండియు (epics) అటుపై కాళిదాస, భవభూతి, భారవి, మాఘ, భర్తృహర్యాది కవీశ్వరులనుండియు శ్లోకములు గ్రహింపబడినవి.

ఇవికాక ప్రసిద్ధములై అనుస్యూతముగ తెలియవచ్చుచున్న సుభాషిత రత్నములును ఇందుచేర్చబడినవి. భారతీయ సంస్కృతి, భావనలు విశేషించి ఆయా కవితారీతులు ఇందు వ్యక్తము చేయబడినవి. ఈ ప్రణాళిక విభిన్న మనస్తత్త్వములుగల జనులందరి ఆశయములకు అభిలాషలకు అనుగుణముగానుండునని భావించుచున్నాను.

స్వర్ణోత్సవ సందర్భమున ఈ కార్యనిర్వహణమున కవసరమైన ఆర్థికసహాయము, ప్రోత్సాహమును ఇచ్చి, వీని ప్రచురణకు కారణభూతులైన మన ఉపకులపతులకు మా నమస్సుమాంజలులు.

వేలూరి సుబ్బారావు
ఆంధ్ర విశ్వకళాపరిషత్ సంస్కృత శాఖాధ్యక్షుడు

# విషయసూచిక

# వేదములు

శ్రీ వేదుల సుబ్రహ్మణ్యం

నేడు మనకుపలభ్యమగు ప్రపంచవాఙ్మయమునందు వేదవాఙ్మయమత్యంత ప్రాచీనమైనదను విషయము నిర్వివాదము. భారతీయ సంప్రదాయమునుబట్టి చూచినచో, ఈ వేదవాఙ్మయము సృష్టికిబూర్వమునుండియు గలదు. వేదమను పదమేదొయొక గ్రంథమునకు గాక, గ్రంథసముదాయమునకు వర్తించును. ఈ వేదరాశి పరమేశ్వరుని ముఖమునుండి బహిర్గతమై శబ్దరూపమున నీ విశ్వమంతట వ్యాపించియున్నది. దానిని మన ప్రాచీన మహర్షులు వారి తపఃఫలములైన అతీంద్రియశక్తులచే విని, అట్లువినశక్తిలేని తమ శిష్యులకుపదేశించిరి. కనుకనే వేదముల పౌరుషేయములు.

అట్టి వేదవాఙ్మయము ప్రధానముగ రెండు భాగములుగ గలదు– 1. మంత్ర భాగము, 2. బ్రాహ్మణభాగము. మంత్రభాగమునే 'సంహితా' భాగమనిగూడ యందురు. మరలనీమంత్రభాగము నాల్గుగ విభజింపబడినది. ఇవియే మనకు సుప్రసిద్ధములై సుపరిచితములైన ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వ వేదము– అనునవి. మంత్రభాగమున కేవలము స్తోత్రరూపములగు ఋక్కులు (శ్లోకములు) యజస్సులు (గద్యము) మాత్రమేయుండును. బ్రాహ్మణమునందు, ఏ మంత్రమును, ఏ యజ్ఞమందు, ఎపుడు, ఎట్లువినియోగించవలెనో, ఏ మంత్రమునకెట్టి యర్థమో మొదలగు అనేక విషయములు చర్చించబడియున్నవి. కనుకనే బ్రాహ్మణము మంత్రభాగమునకు వ్యాఖ్యానమై యొప్పుచున్నది. కాగ, ఋగ్యజుస్సామాథర్వవేదములకు వేర్వేరుగ వ్యాఖ్యారూపములగు బ్రాహ్మణములుగలవు.

ఋగ్వేదము : శ్లోకరూపముననుండు వేదమంత్రమునకు "ఋక్" యని పేరు. అట్టి ఋక్కులతో మాత్రమేకూడియున్న భాగమునకు ఋగ్వేదమనిపేరు. ఐతరేయ; కౌషీతాకీ బ్రాహ్మణములు రెండును ఋగ్వేదమునకు సంబంధించిన బ్రాహ్మణములు.

యజుర్వేదము : ఈ గ్రంథములందలి మంత్రములలోనధికభాగము యజుస్సులగుటచే (గద్యవచనములు) దీనికి యజుర్వేదమనిపేరు. ఇదిశుక్లయజుర్వేదమనియు, కృష్ణయజుర్వేదమని రెండు శాఖలుగనున్నది.

శుక్లయజుర్వేదము: దీనినే "వాజసనేయసంహిత" యనిగూడ అందురు. నేడిది మాధ్యందినశాఖ, కాణ్వశాఖయను రెండు శాఖలుగ ప్రసిద్ధమైయున్నది. 'శతపథబ్రాహ్మణము' శుక్లయజుర్వేదమునకు సంబంధించియున్నది.

కృష్ణయజుర్వేదము: దీనికే "తైత్తిరీయ" సంహితయని మరియొకపేరు. కాఠకశాఖ, కాపిష్ఠలశాఖ, మైత్రాయణీశాఖయను మూడు శాఖలుగనిది లభ్యమగుచున్నది. ఈ వేదమున కేవలమంత్రములేగాక, వానివివరణ వాక్యములుగూడనుండును. శుక్లయజుర్వేదమునందట్టి వివరణవాక్యములుండవు.

తైత్తిరీయ బ్రాహ్మణము కృష్ణయజుర్వేదమునకు సంబంధించినది.

సామవేదము: సంగీతపద్ధతిలో, ఆరోహణావరోహణాది క్రమములతో గానము చేయబడు వేదమంత్రమునకు 'సామ' యనిపేరు. ఇందలిమంత్రములన్నియు నట్టి ప్రత్యేకపద్ధతిలో గానముచేయబడునుగనుక దీనికి సామవేదమని పేరుపచ్చెను. ఇందలిమంత్రములన్నియు చాలవరకు ఋగ్వేదమంత్రములే. స్వతంత్రభాగమత్యల్పము.

తాండ్యబ్రాహ్మణము: సామవేదమునకు సంబంధించినది.

అథర్వవేదము: మంత్రభాగములో కడపటిదియగు నీ గ్రంథము చాలవరకు శ్లోకరూపమున గలదు. అచటనచట గద్యభాగములుకూడయున్నవి. ఇందు మానవులకు కల్గు రోగశత్రుభయనివారణోపాయములు చెప్పబడినవి.

"గోపథబ్రాహ్మణము" అథర్వవేదమునకు సంబంధించిన వ్యాఖ్యానము.

బ్రాహ్మణములందలి చివరిభాగములకు ఉపనిషత్తులనిపేరు. వీనినే జ్ఞానకాండయనియు నందురు.

ఈ వేదములు విశ్వమానవశ్రేయస్సునకై యుద్దేశింపబడినవేగాని, ఏయొక్క కులమువారికో, మతమునకో, దేశమునకో, కాలమునకో పరిమితములుకావు. మానవుడు పుట్టినది మొదలు చనిపోవువరకు ననుభవింపగోరు ఐహికసౌఖ్యములనెట్లు పొందవచ్చునో ఇందు వివరించబడినది. ఇట్టి వేదభాగమునకు కర్మకాండయని పేరు. ఐహికసుఖములశాశ్వతములనియు, జన్మయేసమస్త దుఃఖములకు మూలము గనుక, జన్మరాహిత్యమే నిజమగు శాశ్వతానందమనియు గుర్తెఱిగి, దానినెట్లుపొందవలెనో గూడ నీవేదమందు (ఉపనిషద్భాగమున) చెప్పబడినది. అట్టిభాగమునకు జ్ఞానకాండయనిపేరు.

ఈ విధముగ మానవజాతికే మహోపకారకములగు నీ వేదములను సక్రమముగ నర్థముచేసికొని, యాచరించినచో, నేడు మానవసమాజమందున్న అశాంతి,

భయాందోళనలు తొలిగిపోవును. అంతియకాక, మానవజాతియంతయు వసుధైక కుటుంబముగ జీవించుచు, విశ్వమానవ సౌభ్రాత్రముననుభవించుచు, ననంత శుభములనందగలరు.

ఇట్లు సర్వజనీనములు, సార్వకాలికములగు వేదమునుండికొన్ని స్తుతులు, సందేశములు సూచనమాత్రముగనీతర్వాతి పుటలలో, అయావేదభాగమునుండి గ్రహించబడి పొందుపరుపబడినవి.

## ఉషస్సు

### (ఋ.వే. 1-48)

ఋగ్వేదకాలమునందు పూజింపబడిన స్త్రీ దేవతలలోకెల్ల "ఉషస్సు" చాల ప్రధానమైనదేవత. ఈమెను ఋగ్వేదమందు ఇరువది సూక్తములలో మహర్షులు స్తోత్రముచేసిరి. నాడు స్త్రీదేవతలకుగూడ అత్యంత ప్రాధాన్యము కలదు. సూర్యోదయమునకు ముందుగ, ఆకాశమున, మనకు సూర్యునిరాకను దెల్పుచు కన్పించెడి కాంతసముదాయపుశక్తికే ఉషస్సు అనిపేరు. ఈ శక్తికే మహర్షులు రూప కల్పనచేసి గానముచేసిరని కొందరియభిప్రాయము. అంధకారమును పారద్రోలి సమస్తప్రాణిజాతమును మేల్కొలిపి, వారివారి విధులందు నియుక్తులజేసి, తద్వారా వారికి ఆయురారోగ్యైశ్వర్యాదులనందించెడి దివ్యదేవత ఉషస్సు. అట్టి దేవతా స్వరూపమును మహర్షులు వారి యలౌకిక దివ్యప్రభావముచే కనులారగాంచి, గానము చేసియున్నారు.

"ఉషా" దేవత తనభక్తులకు అష్టైశ్వర్యములను సంప్రాప్తింపఁజేయును. శత్రువులనుండి, మోసగాండ్రనుండి రక్షణ కల్పించి దీర్ఘాయువును ప్రసాదించును. ఆమె తనను నమ్మికొలచినవారిని కీర్తిప్రతిష్ఠలకు కొదవలేకుండ నాదరించును. ఆమె సర్వసంపదలకు స్థానమై విరాజిల్లుచున్నది. అట్టి దివ్యదేవతను వైదిక ఋషులు ఎట్లుగానముచేసిరో ఈ క్రింద ఋక్కులలో చూపబడినది :

1. విశ్వమస్యా ననామ చక్షసే జగజ్జ్యోతిష్కృణోతి సూనరీ ।
   అపద్వేషో మఘోనీ దుహితా దివ ఉషా ఉచ్ఛదప స్రధః ॥

(1.48.8)

తా॥ ఈ చరాచరమగు జగత్తంతయును తేజోరూపిణియగు ఉషస్సునకు నమస్కరించుచున్నది. ఈమె ప్రపంచమునంతను తేజోవంతముగ చేయును. ద్యులోక పుత్రికయగు నీమె ఐశ్వర్యవంతురాలు. ఈమె, మనలను ద్వేషించువారిని, బాధించువారిని దూరముగ పారద్రోలును.

2. ఈ క్రింది ఋక్కునందు, ఉషాదేవత భక్తులకెట్టి లాభములను గూర్చునో చెప్పబడినది.

యస్యా రుశన్తో అర్చయః ప్రతి భద్రా అదృక్షత ।
సా నో రయిం విశ్వవారం సుపేశసముషా దదాతు సుగ్మ్యమ్॥

(1.48.13)

తా॥ ఎవరియొక్క శోభాయమానములగు దివ్యకాంతులు మనలనుద్దేశించి ప్రసరించుచున్నవో యట్టి ఉషఃకాంత, మనల కుత్కృష్టమును, సదాభిలషితమును సుఖప్రాప్యమునగు సంపదను ఇచ్చుగాక॥

అనగ, ఉషోపాసన చేయువారికి అనంత సంపదలు కొంగు బంగారమై యుండునని భావము.

3. ఈ క్రింది ఋక్కులో నొకభక్తుడు, తన్ను సుఖవంతుని జేయుమని ప్రార్థించుచున్నాడు :

ఇదముత్యపురుతమం పురస్తా జ్జ్యోతిస్తమసో వయునావదస్థాత్ ।
నూనం దివో దుహితరో విభాతీర్గాతుం కృణ్వన్నుష సోజనాయ॥

(4.51.1)

తా॥ సుపరిచితయు, తూర్పుదిక్కున క్రమముతప్పక నుదయించెడి స్వచ్ఛ మగు తేజోరూపిణియగు నీమె అంధకారమునుండి బయటపడినది. అట్టి స్వర్లోక పుత్రికయగు దేవత మానవునికి సుఖ (జీవన) మార్గమును కలుగజేయుగాక॥

దీనివలన, నాడు ప్రతియొక్కరు మేల్కొనిన తర్వాత ప్రథమముగ వారి సుఖమయ జీవనమునకు ఉషస్సు నారాధించెడివారని తోచుచున్నది.

4. వేదకాలమునాటి ప్రజలు తాము సదా ఐశ్వర్యముతోను, కీర్తిప్రతిష్ఠలతో నుండవలెనని, దారిద్ర్యముండరాదని కోరుచు అందుకుగాను ఉషస్సును ప్రార్థించు చుండిరి.

తద్వోదివో దుహితరో విభాతీరుప బ్రువ ఉషసో యజ్ఞకేతుః ।
వయం స్యామ యశసో జనేషు తద్ద్యౌశ్చ ధత్తాం, పృథివీచదేవీ॥

(4.51.11)

ఓ స్వర్లోక పుత్రికా ! తేజోస్వరూపిణీ ! ఉషఃకాంతా ! యజ్ఞకేతువునగు నేను నిన్ను స్తుతించుచున్నాను. మానవులందు మేము ప్రఖ్యాతుల మగుదుముగాక. అట్టి మా కోర్కెను భూదేవియు ఉషాదేవియు అనుగ్రహింతురు గాక॥

ఎట్టి కోర్కెలనైనను దీర్చగల దివ్యశక్తిశాలినిగదా ఉషస్సు. ఆమె నారా ధించువారు ఎట్టి బాధలులేక, సమస్త భోగభాగ్యములతో దులదూగుదురు గాన, ప్రతి

యొక్కరు, వేకువననే మేల్కొని, స్నానాదికముల ముగించుకొని, శుచులై ఉషో దయమున కెదురుజూచుచు, ఆమెను ప్రార్థించవలెననునది – వేదసందేశము.

ఉషఃకాంతులు దేహముపై పడిన, అందలి శక్తివంతములగు కిరణములు మన దేహమున ప్రవేశించి అనేక విధములగు రోగములనుండి మనలను కాపాడు నని నేటి విజ్ఞానులుగూడ చెప్పుచున్నారు. అట్టి వైజ్ఞానిక సత్యములను గ్రహించిన మహర్షులు, ఉషఃకాంతులను కీర్తించి సామాన్య ప్రజలకుగూడ చైతన్యమును కల్గించిరి.

## నాసదీయమ్

## (ఋ.వే. X – 129)

"నాసదీయమ"ను ఈ సూక్తము ఋగ్వేదమున పదియవ మండలములోని 129 వ సూక్తము. ఇందు, ప్రప్రథమముగ సృష్టిని గూర్చిన శాస్త్రీయమైన ఆలోచ నలు, వేదాంతధోరణులు, మనకు కన్పించును. భగవదారాధనాపరులైన మహర్షులు, సృష్టిక్రమమును గూర్చిన యాలోచనలకు బీజావాపము నిందు చేసిరని చెప్ప వచ్చును.

ఈ సూక్తమున ప్రళయమునందును మహా ప్రళయమునందును విశ్వము యొక్క స్థితి వర్ణింపబడినది. ఇందు ఏడు ఋక్కులు గలవు. కాని యిచట నాల్గు ఋక్కులు మాత్రమే వివరింపబడినవి.

ప్రళయము రెండు రకములు – (1) అవాంతర ప్రళయము. (2) మహా ప్రళయము. ప్రస్తుత సూక్తమున మహాప్రళయము నందేమియగును అనునది వివరింపబడినది.

1. నాసదాసీన్నో సదాసీత్తదానీం నాసీద్రజో నో వ్యోమ పరోయత్ ।
కిమావరీవః కుహ కస్య శర్మన్నమ్భః కిమాసీద్గహనం గభీరమ్॥

ప్రలయావస్థలో జగన్మూల కారణము శశవిషాణమువలె కేవలము 'అసత్తు' కాదు. అట్లని ఆత్మవలె నున్నదియు (సత్తు)ను గాదు. అయిన— "సదసదు భయా త్మకమా" యనిన అదియునుగాదు. కాగా ఇచట నిషేధ్యము మాయాసత్త్వమే. పారమార్థికసత్త్వముగాదు. పాతాళాదిభూమి పర్యంతమున్ను, ఆకాశాది సత్యలోక పర్యంతముగల దేదియునులేదు. ఆవరింపబడు లోకములు నిషేధింపబడినవి. అట్లే ఆవరకములగు వియదాదులుగూడ నిషిద్ధములే. అనగా భోగ్య, భోక్తృ ప్రపంచ మంతయు లేనిదే యగుచున్నది. "ఆపోవా ఇదమగ్రే సలిలమాసీత్" అను శ్రుతి ననుసరించి నీరున్నదని చెప్పరాదా! యనిన, అదియునులేదు. మీరు చూపిన శ్రుతి

అవాంతర ప్రళయమునందుండు స్థితిని జెప్పునే కాని మహాప్రళయమందు అది యును ఉండదు. పై బుక్కునందు, మహా ప్రళయావస్థ యందు ఏది యుండును? ఏది యుండదు. అట్టి స్థితి ఎట్లుండును. ఏమియులేనట్టి శూన్య స్థితి సాధ్యమా? ఇప్పుడున్నదంతయు ఎచటకు పోవును? ఆ స్థానమెద్ది? అదిమాత్ర మెట్లుండును – మొదలగు అనేక శంకలుదయించును. వానినే వివరించుచున్నారు:

2. నమృత్యురాసీ దమృతం న తర్హి న రాత్ర్యా అహ్న ఆసీత్ప్రకేతః।
అనీదవాతం స్వధయా తదేకం తస్మాద్ధాన్యన్నపరః కించనాస॥

జగత్తును సంహరించునది మృత్యువు. కనుక మహా ప్రళయమున నదియున్నదా! — లేదు. పోనీ, మృత్యువు నిషేధింపబడినది కనుక తదభావకృత మగు "అమరణ" మున్నదా! — అదియునులేదు. పోనీ ఈ ప్రళయము జరగవలె నన్న ఏదియో యొక కాలమానన్నమవ వలెగద. కనుక అపుడు కాలమున్నదియని జెప్పవచ్చుగదా యనిన అదియునులేదు. ఏలయన, కాలమనునది దివారాత్రి రూపము. తత్కర్తలు సూర్యచంద్రాదులు. వారే లేనపుడు తత్కృతమగు కాల మెట్లుండును? కనుక కాలముగూడలేదు. కాగా అప్పుడు పరమేశ్వరుడగు నిరుపాధిక బ్రహ్మమే మిగులును. ఇట్లు సాంఖ్యులచే చెప్పబడు త్రిగుణాత్మకమైన మాయగూడ "స్వధయా" అని చెప్పుటచే నిషేధింపబడెను. కనుక అట్టి పరబ్రహ్మ, తన ఇచ్ఛా శక్తితో యున్నవాడయ్యెను. అతనికంటె భిన్నమగు భూత భౌతికాత్మకమగు జగ మేదియు లేదనియే చెప్పబడెను. శుక్తియందు రజతసంబంధమువలె ఇట్టి యసంగ బ్రహ్మయందు మాయా సంబంధము "అధ్యస్త" మగుచున్నది. పై బుక్కున చెప్పిన 'నపరః' అను నిషేధము సృష్ట్య నన్తరమున్న యీ జగత్తు సృష్టికి పూర్వ లేదనియే నిషేధము. అంతియగాని మాయసహిత పరబ్రహ్మకుగాదు. మొదటి బుక్కునందలి శంకా సమాధానములనే యింకను వివరించుచున్నారు.

3. తమ ఆసీత్తమసా గుళ్హమగ్రేऽ ప్రకేతం సలిలం సర్వమా ఇదం।
తుచ్ఛేనా భ్వపిహితం, యదాసీత్తపస స్తన్మహినా జాయతైకమ్॥

పూర్వ బుక్కునందలి ప్రశ్నకు సమాధానము చెప్పుట: "తమసా గుళ్హమగ్రే" యని. అనగ చీకటిచే పదార్థ జాతమంతయు నావరింపబడినట్లు సృష్టికి పూర్వము ప్రళయదశలో భూతభౌతిక జగమంతయు తమస్సుచే నావరింపబడియున్నది. తమస్సనమాయ. ఆచ్ఛాదకమగు నా మాయనుండి నామరూపములతో నావిర్భవించు టయే జన్మ. అట్లగుచో కారణభూతమగు తమస్సునందు జగద్రూప కార్యము న్నచో "న ఆసీద్రజః అను నిషేధమెట్లు కుదురును" అను ప్రశ్నకు సమాధాన ముగ "తమఆసీత్" అని చెప్పబడెను. తమస్సన భావరూపాజ్ఞానము. ఇది మూల కారణము. జగత్తునకు తద్రూపత్వము. అట్లగుచో తమస్సుకర్త. జగత్తుకర్మ. అట్టి

కర్తృకర్మల కేకత్వము ఎట్లు అను ప్రశ్నకు జవాబు అప్రకేత మని చెప్పెను. అనగ వ్యవహారదశలో వలె నా దశలో స్పష్టమగు జ్ఞానముండదుగావున తాదాత్మ్యము చెప్పబడెను. "స్పష్టముగ ఏల తెలియబడదు?" అను ప్రశ్నకు సమాధానము "సలిలం సర్వమా" అనగ దృశ్యమాన జగమంతయు కారణతమస్సుతో నవి భాగాపన్నమై యుండెనని భావము. "అట్టైన సృష్టిసమయమునగూడ నా జగత్తు ఉద్భవించుట ఎట్లు?" అనినచో, "స్రష్టవ్య పర్యాలోచన"మగు తపోమహిమచే నది యుత్పన్నమగునని సమాధానము. "యస్సర్వజ్ఞ స్సర్వవిద్యస్య జ్ఞానమయం తపః" అని ముండకోపనిషత్తు 1.1.9.

జగదుత్పత్తికి ఈశ్వర పర్యాలోచనమే కారణమైనచో "దానికిగూడ కారణ మేది?"యను ప్రశ్నకు సమాధానమును చెప్పుచున్నాడు:

4. కామస్తదగ్రే సమవర్తతాధి మనసో రేతః ప్రథమం యదాసీత్ ।
సతో బన్ధుమసతి నిరవిన్దన్హృది ప్రతీష్యా కవయో మనీషా ॥

ఈశ్వర పర్యాలోచనమునకుగూడ అతని కామమే కారణమయ్యెను. కామ మనగ సృజనేచ్ఛ. "అదిగూడ ఏల కల్గెననిన" పూర్వకల్పమున ప్రాణులుచేసిన పుణ్య కర్మ వృద్ధినొంది ఫలోన్ముఖమై సాక్షిభూతుడు, కర్మాధ్యక్షుడునైన పరమేశ్వరునికి సిసృక్షా కారణమయ్యెను. సిసృక్ష అనగ సృష్టించవలెననుకోర్కె. అందుచే నతడు పర్యాలోచన జేసి జగత్తును సృజించును. ఈ విషయమును అనగ కల్పాంతరమందలి ప్రాణుల కర్మసమూహము జగదుత్పత్తికి కారణభూతమని – భూత భవిష్యద్వర్తమానముల నెఱింగిన మహాయోగులు తమ దివ్యజ్ఞాన బలముచే విచారించి వివరముగ, నెఱింగించి యున్నారు ॥

సూచన: పై ఋక్కులనందలి పదములు ప్రశ్నలకు జవాబులు. కనుక సందేహములను గుఱించి సమగ్ర చర్చ గురుశిష్యులు జేసి, తర్వాత తేలిన సమాధాన సారములను ఋక్కుల రూపంలో వ్రాయుట జరిగినది. కనుక ఇటువంటి వాని విషయమందు భాష్యమును పూర్తిగా పరిశీలించిననేగాని, ఏ పదము ఏ ప్రశ్నకు సమాధానమను విషయము తెలియదు. పైన వ్రాసిన భావములు ఆయా ఋక్కుల భాష్యమునకు సంగ్రహరూపముమాత్రమే – యని గమనించవలెను.

## "సంజ్ఞానమ్"

## (ఋగ్వేద X - 191)

ఈ సూక్తము ఋగ్వేదమందలి పదియవ మండలములోనిది. ఇందు కేవలము 'నాల్గు' ఋక్కులుమాత్రమే గలవు. ఈ ఋక్కులలో ముఖ్యముగ మనో

వాక్కర్మలకు ఐక్యమును నొక్కిచెప్పడమైనది. ఈ సూక్తంలో దైవస్తుతికంటె సమాజమున కిచ్చిన సందేశమే ప్రధానమైనది. ఈ నాటి 'సెక్యులర్' భావాలను ఆలనాటి నుంచి ప్రబోధించటం జరుగుతోంది.

ఇందు మొదటి ఋక్కు మాత్రము అగ్నినుద్దేశించి చెప్పబడినది. మిగిలిన మూడును సమాజ పరముగకూడ అన్వయించును.

1. సంసమిద్యువసే వృషన్నగ్నే విశ్వాన్యర్య ఆ।
   ఇళస్పదే సమిధ్యసే స నో వసూన్యా భర ॥

సమస్తమైన కోర్కెలను దీర్చు ఓ అగ్నిదేవా! సర్వ (జగత్) ప్రభువు అగు నీవు అంతటను పరివేష్టించియున్నావు. అట్టి నీవు ఈ పృధ్వీ (యజ్ఞ) వేదికపై మాచే పూజింపబడుచుంటివి. అట్టి నీవు మాకు సమస్త సంపదలను అనుగ్రహింపుము.

ఈ రెండవఋక్కునందు, ఋషులు మనమెట్లు సమభావంతో జీవితం పంచుకొనవలెనో జెప్పుచున్నారు :

2. సంగచ్ఛధ్వం సంవదధ్వం సం వో మనాంసి జానతామ్।
   దేవా భాగం యధా పూర్వే సంజానానా ఉపాసతే ॥

మీరందరు కలసికట్టుగ (ఐకమత్యంతో) ఉండుడు. మీరందరు ఒకేమాటకు కట్టుబడి యుండుడు. అంతియకాక మీ మనస్సులందు ఒకేవిధముగ ఆలోచించుడు. దేవతలందరు ఎట్లు ఏకబుద్ధితో వారివారి హవిస్సులను గ్రహించుచున్నారో, మీరును అట్లే మీ మీ జీవిత భాగములను అనుభవించుడు.

అనగ "మనోవాక్కర్మలందు ఐక్యముగల్గి, కుటిలమగు బుద్ధులులేక, స్వచ్ఛమగు స్వభావముతో, సమాజ శ్రేయస్సునకై పని చేయుడు" అను సందేశము ధ్వనించుచున్నది.

రెండవ ఋక్కులోని భావమునే విశదీకరించుచున్నారు :

3. సమానో మన్త్రః సమితః సమానీ సమానం మనః సహచిత్త మేషామ్।
   సమానం మన్త్రమభి మన్త్రయే వః సమానేన వో హవిషా జుహోమి ॥

వీరియొక్క ఆలోచన ఏకముఖమై యుండుగాక. వీరి నిర్మాణపద్ధతియు వైరుధ్యములేకుండ ఉండుగాక. వీరి మనస్సులనందు భేదము (భావవైరుధ్యం) లేకుండునుగాక. అట్టివారితో నేనుగూడ కలసి యాలోచించి, పూజించెదను.

'ఇందులోగూడ సమాజములోని వ్యక్తులందరు పెద్ద, కొద్ది భావములేక, "అందరము ఒకటి" యను భావముతో సర్వ శ్రేయోదాయకములగు కార్యముల నాచరించుచు జీవించవలెను' అను ఆదేశము స్ఫురించుచున్నది. సాధారణముగ

ప్రతి వేదబుక్కుపైకి దేవతాస్తోత్రముగ నున్నను దానికి సామాజిక పరమగు ఉద్బో ధనగూడ గర్భీకృతమై యుండును. కనుక బాహ్యార్థముతోపాటు, జీవశక్తియగు అంతస్సారమునుగూడ గుర్తించవలెను.

మీది భావమునే మరల మరల చెప్పుచున్నారు.

4. సమానీ వ ఆకూతిః సమానా హృదయాని వః ।
సమాన మస్తు వో మనో యథావః సుసహాసతి ॥

మీ యొక్క కోర్కెలు, మీయొక్క భావనలు, మీయొక్క ఆచరణలు–అన్నియు వైరుధ్యములేని విధముగ సమానముగ ఉండుగాక. అనగ ఎవరు ఏమికోరుకున్నను, చేసినను, పొందినను అది ఇతరులకు హానికలుగని విధముగ సుఖదాయకమై యుండవలెనని భావము. మిమ్ములను ఎట్టిసమాజము సుఖింపచేయగలదో దానిని పొందుడు (నిర్మించుకొనుడు).

పైబుక్కున సమాజములోని ప్రతివ్యక్తి సుఖశాంతులను బొందవలెనన్న, ఇతరులు తనపట్ల, తను ఇతరులపట్ల ఎట్లుమెలగవలెనో స్థూలముగ సూచించబడినది.

## అథర్వవేదము

### సామ్మనస్యమ్ (అ. వే. III–30–38)

ఈ సూక్తము అథర్వవేదములోనిది. ఈ సూక్తమునందుగూడ పూర్వసూక్తము నందువలె సమాజమును, కుటుంబమును ఉద్దేశించి సందేశమీయబడెను. ఐక మత్యముతో, ఒకరిపట్లమరియొకరు ప్రేమాభిమానములతో క్రమశిక్షణను పాటించి జీవించ వలెనను ఉపదేశము ఇందుకలదు.

1. సహృదయం సాంమనస్యమవిద్వేషం కృణోమివః ।
అన్యో అన్యమభిహర్యత వత్సం జాతమివాఘ్న్యా ॥

తగవులాడుకొను ఓ జనులారా! మీకు పరస్పరద్వేషశూన్యమును, సమాన చిత్తవృత్తి గలదియు, సమానమానవతా పాదకమునగు సఖ్యమును బోధించు చున్నాను. కావున, మీరు పరస్పరము లేగటిదూడలనావులవోలె ప్రేమించు కొనుడు.

అనగా తల్లి బిడ్డలను ప్రేమించునట్లు, సమాజములోని ప్రతిఒక్కరు ఇతరుని ప్రేమించవలయును. అట్లగునేని సమాజమున సుఖశాంతులుండి, తనకుగూడ వ్యక్తి గతముగ సౌఖ్యముగల్గును.

ఈ ఋక్కు కుటుంబసభ్యులెట్లు మెలగవలెనో చెప్పును.

2. అనువ్రతః పితుః పుత్రో మాత్రాభవతు సంమనాః।
జాయా పత్యేమధుమతీం వాచం వదతు శన్తివామ్ ॥

కొడుకు తండ్రికనుకూలముగ ఉండవలెను. అనగతండ్రికోర్కెలను దీర్చుచు అతనిని అనుసరించవలెను. తల్లియు పుత్రాదులయెడ, మంచిమనస్సు కల్గియుండ వలెను. అనగ బిడ్డలమనసునెఱింగి వారికి హిత, సుఖములగూర్చవలెను. అట్లే భార్యయు భర్తకనుకూలురాలై, మధురసంభాషణలతో సుఖశాంతులను కల్గించ వలెను.

మరియు :

3. మా భ్రాతా భ్రాతరం ద్విక్షన్మా స్వసారముత స్వసా।
సమ్యఞ్చః స్వ్రతా భూత్వా వాచంవదత భద్రయా ॥

అన్నదమ్ములొకరినొకరు ద్వేషింపరాదు. అనగ ఆస్తిపంపకము మొదలగు విషయములలో కలహింపరాదు. ఇట్లే అక్కసెల్లెండ్రునుగూడ మెలగవలెను. కాగా, అన్నదమ్ములు, అక్కసెల్లెండ్రునందరును పరస్పరము కలహింపక, దుర్భాషలాడు కొనక, శుభకరములగు మంచి మనసులతో ప్రియహితవాక్యములనే పలుకుచుండ వలెను.

మనమెట్లు ఐకమత్యము కల్గియుండవలెనో సోదాహరణముగ చెప్పుచున్నారు :

4. సధ్రీచీనాన్ వః సంమనసస్కృణోమ్యేక శ్నుష్టీన్త్సంవన నేనసర్వాన్।
దేవా ఇవామృతం రక్షమాణాః సాయంప్రాతః సౌమనసో వో అస్తు ॥

ఏదియైన పనిని చేయుటందు మిమ్ము పరస్పరము సహకరించువారినిగను, ఏకచిత్తులుగను చేయుదును. మీకందరకునొకేవిధమగు వ్యాపారమును, భుక్తిని గూడ ఒనగూర్తును. ఇట్టి "సాంమనస్యకర్మ" చే మిమ్ములను వశపరచుకొందును. స్వర్గమున నింద్రాదిదేవతలు తమ కజరామరత్వ మొనగూర్చు నమృతమునైకమత్య ముతో గాపాడుకొనునట్లు మీరెల్లవేళల ప్రియహితమునుగూర్చు సౌమనస్యమును కాపాడుకొనుడు. అనగా మంచిమనస్సును కల్గియుండుడు.

మానవయత్నమునకు దైవముకూడ అనుకూలింపవలెను. కనుక దైవ సాహాయ్యమును పొందవలెనను భావమీక్రింది ఋక్కున చెప్పబడినది :

5. యేనదేవా నవియన్తి నో చ విద్విషతే మిథః।
తత్కృణ్మో బ్రహ్మ వో గృహే సంజ్ఞానం పురుషేభ్యః ॥

ఎట్టి స్తోత్రములు చేయుటవలన, దేవతలు మనకు దూరముకారో, ద్వేషింపరో అర్చనను మీగృహములందు ఆచరింతుము. అందువలన మీకు (మీకుటుంబ ్యులకు) ఆత్మీయభావన వర్ధిల్లును.

కలసి దైవప్రార్థనలు చేయుటయందు, అందరునొకచోట గూడుదురుగాన, ంలో ఒకవిధమగు సంఘీభావము ఏర్పడును. కనుక ఆవిధముగ ప్రార్థనలు ుదుము. అనిభావము.

సమాజసభ్యులనుద్దేశించి చెప్పుచున్న సందేశము :

6. జాయస్వన్తశ్చిత్తినో మా వియౌష్ట సంరాధయన్తః సధురాశ్చరన్తః ।
అన్యో అన్యస్మైవల్గు వదన్త ఏత సధ్రీచీనాన్ వః సంమనస్కృణోతి ॥

సంఘీభావముకల్గియిండుట మొదలగు ఉత్తమగుణములతోనుండు మనస్సు ్గిన యో జనులారా! మీలోమీరు ద్వేషించుకొనరాదు. పరస్పరము గౌరవించు నుచు, కలసి పనిచేయుచు మధురభాషణములతోనిటురండు. అట్టి మీకు సఖ్య ును, భావైక్యమును కల్గునట్లుచేసెదను.

అనగా "అట్టి మీకుఇంకను అధికమగు విజ్ఞానరహస్యములను తెలియజెప్పె ను. అట్టివానిని తెలుసుకొని, వానివలనకల్గు ప్రయోజనములను బొందుటలో ంరింకను సఖ్యమును, భావైక్యమును బొందుదురని" భావము.

## యజుర్వేదము

యజుర్వేదము గద్యముతోను, ఋక్కులతోను కూడియున్నది. ఇట్టిగద్య ాగమునకు 'యజున్' అనిపేరు. ఈక్రింద అట్టియజస్సు ఒకటి కలదు. దీనిని ాధారణముగ, యజ్ఞయాగాదిక్రతువు పూర్తియైనతర్వాత పఠించెదరు. ఇందలి ఇతి ృత్తము, శైలి నేటినాటకములందలి భరతవాక్యమును బోలియుండును.

## యోగక్షేమః

### యజుర్వేద XXII–22.

ఆ బ్రహ్మన్ బ్రహ్మణో బ్రహ్మవర్చసీ జాయతామా రాష్ట్రే
రాజన్యః శూర ఇషవ్యోఽతి వ్యాధీ మహారథో జాయతాం ।
దోగ్ధ్రీధేనుః వోఢానడ్వానాశుః సప్తిః పురన్ధిర్యోషా
జిష్ణూ రథేష్ఠాః సభేయో యువాస్య యజమానస్య

వీరో జాయతామ్। నికామే నికామే నః పర్జన్యోవర్షతు।
ఫలవత్యో న ఓషధయః, పచ్యన్తాం యోగక్షేమోనః కల్పతామ్॥

ఓ పరమేశ్వరా! వేదవిద్యయందు దిట్టలగు బ్రాహ్మణులు మాజాతియందు జన్మింతురుగాక (జన్మించునట్లు అనుగ్రహింపుమని భావము). యుద్ధమునందు మహావీరులు, శూరులు, ధైర్యశాలురునగు క్షత్రియులు మాజాతియందు ఉద్భవింతురుగాక. అత్యధికముగ పాలనిచ్చెడి గోసంతతి వర్ధిల్లుగాక. ఎంతటి బరువైనను హేలగ భరించగల వృషభములు, అత్యంత జవముగల్గిన అశ్వములు మాకు ఎల్లపుడు కల్గుగాక. సర్వసద్గుణసంపన్నలగు స్త్రీలు మాకుకల్గుదురుగాక. ఈ యజమానికి, విద్వద్గోష్ఠులందు, యుద్ధమునందుగూడ పాల్గొనగల్గు యువకులైనట్టియు, శూరులైనట్టిపుత్రులు గల్గుదురుగాక. మాకనుకూలముగ వర్షమును వరుణదేవుడు కురిపించునుగాక. మాచెట్లుచేమలు ఫలవంతములగు గాక. మాకు ఎల్లపుడు శుభములు కల్గుచు, రక్షింపబడుదుముగాక.

## శివసంకల్పః

### యజుర్వేద – (39-1-6)

శివసంకల్పమన సత్సంకల్పమని (మంచి భావములు) యర్థము. ఇదిగూడ యజుర్వేదమునుండియె గ్రహింపబడినది. ఇందు మానవుడు తన మనస్సును, చిత్తమును ఎంత పవిత్రముగ నుంచుకొనవలెనో చెప్పబడినది.

1. యజ్జాగ్రతో దూరముదైతి దైవం తదు సుప్తస్య తథైవైతి।
   దూరం గమం జ్యోతిషాం జ్యోతిరేకం తన్మే మనః శివసంకల్పమస్తు॥

భావము: ఏ మనస్సు పురుషుని జాగ్రదవస్థలో చక్షురాదులకంటె దూరముగ బోవునో, ఏ మనస్సు స్వప్నావస్థలో దూరముగబోయి సుషుప్త్యవస్థలో తిరిగి వచ్చునో, ఏ మనస్సు భూత భవిష్యద్వర్తమానము లైనట్టియు తిరోహితములైనట్టి వస్తువులను గ్రహించునో ఏ మనస్సు శ్రోత్రాదీంద్రియములకు ప్రవర్తకమో, అట్టి నా మనస్సు పాప సంకల్పము లేనిదై, ధర్మ సంకల్పములు గలదై యుండుగాక॥

2. యేన కర్మణ్యపసో మనీషిణో యజ్ఞేకృణ్వంతి విదథేషు ధీరాః।
   యదపూర్వం యక్షమన్తః ప్రజానాం తన్మే మనః శివసంకల్పమస్తు॥

భావము: స్వస్థమైన యే మనస్సుచే కర్మఠులును ధీరులునగు మేధావులు హవిరాది పదార్థ జ్ఞానము కలిగి, యజ్ఞమున కర్మల నాచరింతురో, ఏ మనస్సు ఇం

ంద్రియములకు ముందుగ సృజింపబడెనో, ఏ మనస్సు యజ్ఞమో, ఏ మనస్సు బాహ్యేంద్రియముల వలెగాక, సకల ప్రాణి మాత్రుల శరీర మధ్యను ఉండునో, అట్టి నా మనస్సు ధర్మ సంకల్పము కలది యగుగాక॥.

3. యత్ప్రజ్ఞానముత చేతో ధృతిశ్చ, యజ్జ్యోతి రన్తరమృతం ప్రజాసు ।
యస్మాన్న ఋతే కించన కర్మ క్రియతే తన్మే మనః శివసంకల్పమస్తు॥

భావము : ఏ మనసు విశేష జ్ఞాన జనకమో, మరియు ఏ మనసు సామాన్య విశేషజ్ఞాన జనకమో, ఏ మనసు ధైర్యరూపమో, ఏ మనసు జనులలో నుండి సర్వే న్ద్రియ ప్రకాశకమో, ఏ మనసు ఆత్మరూపమగుటచే నిత్యమో, ఏ మనసు లేనిదే జనులు కర్మ ప్రవృత్తులుకారో, అట్టి నా మనస్సు ధర్మ సంకల్పము (మంగళకర మగు నిశ్చయములు) గలది యగుగాక॥

4. యేనేదం భూతం భువనం భవిష్యత్పరి గృహీత మమృతేన సర్వమ్ ।
యేన యజ్ఞస్తాయతే సప్తహోతా. తన్మే మనః శివసంకల్పమస్తు ॥

భావము : ఏ మనసు అమరమైనదో, ఏ మనసుచే భూత, భవిష్యద్రూప మగు ఈ సమస్త భువనము గ్రహింపబడుచున్నదో, ఏ మనస్సు ఏడుగురు ఋత్వి క్కులతో అగ్నిష్టోమయాగము చేయుచున్నదో, అట్టి నామనసు ధర్మసంకల్పము కల్గినదిగ యుండుగాక॥

5. సుషారధి రశ్వానివ యన్మనుష్యా న్నేనీయతేఽభీ శుభిర్వాజినఇవ ।
హృత్ప్రతిష్ఠం యదజిరం, జవిష్ఠం, తన్మే మనః శివసంకల్పమస్తు॥

భావము : నేర్పరియగు రౌతు, గుఱ్ఱములను కొరడాతో నెట్లు నడపునో, పగ్గ ములచే ఎట్లు నిలుపునో అట్లే ఏ మనసు జీవులను నడుపునో, మరల నిలుపునో, ఏ మనసు హృదయ మందుండునో, ఏ మనసు బాల్యయౌవన వార్ధక్యములందు నొకే రీతిగ నుండుటచే ముసలితనము లేనిదో, ఏ మనసు అన్నిటికంటెను వేగము కలదో, అట్టి నా మనసు ధర్మ సంకల్పము కలదిగ యుండుగాక॥

ఈ విధముగ వైదిక సందేశములన్నియు వ్యక్తిని, సమాజమును, సమస్త లోకములను గూడి ఉద్ధరించుటకై ఉద్దేశింపబడినవి. వానిని సక్రమముగ నవగ తము చేసికొని, యాచరించిననాడు మానవుడు, మానవత్వమునుండి దైవత్వమును బొందగలడు॥

# ఉపనిషత్తులు

డా॥ గాలి పార్థసారథిరావు

ఉపనిషత్తులు ఆత్మానుభవమునందిన మహర్షుల ప్రవచనములు – ఏ ఉప నిషత్తు యే మహర్షి దృష్టములో తెలియుటలేదు – కాని అవి సమాధి స్థితినందిన యోగుల అనుభవ సంపుటి యనుటలో సందేహములేదు – అవి వేదవాఙ్మయమున చివరి భాగములగుటచే వేదాన్తమని పిలువబడుచున్నవి. ఉపనిషత్తుల సంఖ్య మొత్తముమీద 108 అని తెలియుచున్నది. కాని అందు పది మాత్రమే ప్రాధాన్యము నొందియున్నవి. శ్రీ శంకర భాగవత్పాదులునూ ఆ పదింటినే వ్యాఖ్యానించియున్నారు.

ఇచట ప్రసిద్ధములైన ఉపనిషత్తులనుండి సేకరింపబడిన కొన్ని శ్లోకముల అర్థము, విశేషాంశములు తెలుపబడును.

ఈ క్రింది శ్లోకము ఈశావాస్యోపనిషత్తునందలిది. లోకమున విషయము లన్నియూ అనాసక్తతతో సేవింపబడినప్పుడే ఆనంద హేతువులగుచున్నవి. సక్తతతో గూడిన అనుభవము దుఃఖ హేతువగుచున్నది. ఈ విషయమే యిందు విశదీకరింప బడినది.

1. ఈశావాస్యమిదం సర్వంయత్కించ జగత్యాం జగత్ ।
   తేనత్యక్తేన భుంజీథాః మాగృధః కస్యస్విద్ధనమ్॥

ఈ జగత్తునందలి సమస్త వస్తువులు పరమేశ్వరునిచే వ్యాప్తములైయున్నవి. కనుక సర్వము యీశ్వరాధీనమని తెలిసికొని స్వార్థనిరపేక్షముగా సుఖమనుభవింప వలెను. విషయములయందతి తృష్ణ పనికిరాదు. నిజమాలోచించినచో యీ సంపద యంతయూ ఎవరిది ?

సామ్యవాద వ్యవస్థకు ఆధారభూతమైన అర్థమును యీ శ్లోకము ప్రతిపాదించు చున్నది. ఆ సిద్ధాంతము ననుసరించి ధనవంతులు సమాజమునకు ధర్మకర్తలవంటి వారు (Trustees).

2. యస్మిన్ సర్వాణి భూతాని ఆత్మైవాభూద్విజానతః ।
   తత్రకో మోహః కః శోకః ఏకత్వమనుపశ్యతః ॥

ఈ శ్లోకముకూడ పై జెప్పబడిన ఈశావాస్యోపనిషత్తులోనిదే. అనేకత్వమునం

దేకత్వము సృష్టి రహస్యము. ఎవడు జగత్తునందలిద్వైతభావమును వీడి ఏకత్వాను. భవమునందునో అతడే దుఃఖాతీతుడగును. ఈ శ్లోకము యీ అంశమునే ప్రతిపాదించుచున్నది. ఏ విద్వాంసునకు సమస్త భూతములు తన ఆత్మకంటె అభిన్నములుగా గోచరించునో, ఎవడు ద్వైధీభావమునందిన యీ సృష్టియందు ఏకత్వమును దర్శించునో, అట్టివానికి మోహమెక్కడ? శోకమెక్కడ? అద్వైతానుభవమునందే శోక మోహములు నశించునని భావము.

3. లోకమున శ్రేయస్సుఅనునది ఒకటి; ప్రేయస్సుఅనునది వేరొకటి-శ్రేయస్సు శాశ్వత సుఖము నొసంగునది. తాత్కాలికమైన సుఖమును చవిచూపి ఎడతెగని దుఃఖపరంపరలకు త్రోవతీయునది ప్రేయస్సు. వివేకియగువాడు శ్రేయస్సును స్వీకరించి ప్రేయస్సును త్యజించును. మందబుద్ధియగువాడు ప్రేయస్సునకు లోభించి శ్రేయో విముఖుడగును. ఈ శ్లోకమున యీ అంశము వివరింపబడినది. ఈ శ్లోకము కఠోపనిషత్తునుండి గ్రహింపబడినది.

శ్రేయశ్చ ప్రేయశ్చ మనుష్య మేతస్తౌసంపరీత్య వివినక్తి ధీరః।
శ్రేయోహిధీరో ఽభిప్రేయ సోవృణీతే ప్రేయోమన్దో యోగక్షేమాద్ వృణీతే॥

జీవితమున ప్రతి మానవునకు శ్రేయస్సు ప్రేయస్సు అను యీ రెండునూ తటస్థపడును. ధీరుడైనవాడు యీ రెంటిని వివేచించి ప్రేయస్సును వదలి శ్రేయస్సును పరిగ్రహించుచున్నాడు. ఇక మందుడన్ననో శ్రేయస్సును వదిలి యోగక్షేమములను కోరి ప్రేయస్సును అభిలషించుచున్నాడు.

4. ఉపనిషత్తులలో అత్యంతము ప్రసిద్ధమైన వానిలో కఠోపనిషత్తు ఒకటి. అందు యముడు ఆత్మజ్ఞానార్థియై వచ్చిన నచికేతునితో యిట్లనుచున్నాడు.

"నతత్ర సూర్యోభాతి నచంద్ర తారకం నేమావిద్యుతో భాన్తి కుతోఽయమగ్నిః
తమేవ భాన్తమను భాతి సర్వంతస్య భాసా సర్వమిదంవిభాతి ॥

సర్వభూతాంతరస్థమైన యే ఆత్మవస్తువు కలదో దానిని సూర్యుడు ప్రకాశింప జేయలేడు – చంద్రతారకలునూ మెరుపులునూ దానిని ప్రకటింపజేయలేవు – ఇక అగ్ని మాటయేమి? సర్వమును స్వయంప్రకాశకమైన దానిని అనుసరించియే భాసించుచున్నది. దాని కాంతిచే దృశ్యమానమగునీ జగత్తు సర్వము ప్రకాశించుచున్నది.

5. ఓం సహనావవతు। సహనౌభునక్తు। సహవీర్యం కరవావహై।
తేజస్వినావధీతమస్తు। మావిద్విషావహై। ఓమ్। శాంతిః శాంతిః శాంతిః

ఈ ఆశంసనము తైత్తిరీయోపనిషత్తులోనిది. ఆచార్యులు తమకు శిష్యులకు మధ్య నుండవలసిన సమరసభావమును యీ వాక్యములలో విశదీకరించినారు.

శాంతి శబ్దము ముమ్మారు వాడబడి మానవుని భౌతిక, మానసిక, అధ్యాత్మిక స్థితుల యందు ప్రశాంతిని ఆశంసించుచున్నది. "అతడు (పరమేశ్వరుడు) మనలను (గురు శిష్యులను) రక్షించుగాక; అతడు మనలనుగూర్చి శ్రద్ధ తీసుకొనుగాక! మనము బలవంతులమగుదుముగాక! మన అధ్యయనము తేజోవంతమగుగాక! మనము పరస్పర విద్వేష భావములకు గురి కాకుందుముగాక!" అన్ని స్థితులయందును మనకు శాంతి లభించునుగాక. ఈ వాక్య సముచ్చయము గురుశిష్యులకు అధ్యయన కాలమున నుండవలసిన మనోనైర్మల్యమును విశదీకరించుచున్నది. ఆధునిక కాలమునందలి గురుశిష్యులు ఈ సూక్తులనుండి స్ఫూర్తిని గ్రహింతురుగాక! తదనుగుణముగా ప్రవర్తింతురుగాక!

6. సహోవాచ నవాఅరే పత్యుః కామాయ పతిః
ప్రియోభవతి ఆత్మనస్తు కామాయ పతిః ప్రియోభవతి...
నవాఅరే సర్వస్యకామాయ సర్వం ప్రియంభవతి
ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియంభవతి.

ఈ సూక్తి బృహదారణ్యకోపనిషత్తునుండి గ్రహింపబడినది. యాజ్ఞవల్క్య మహర్షి తన భార్యయగు మైత్రేయికి ఆత్మతత్త్వమునుపదేశించుచూ అన్నపలుకులు. "అతడు (యాజ్ఞవల్క్యుడు) పలికెను. భర్త భర్తయగుటవల్లనే ప్రియముకాదు. ఒకతెకు ఆత్మయందున్న అనురాగమువలననే భర్త ప్రియుడగుచున్నాడు. (అదే విధముగా) ప్రతి వస్తువును దానికొరకది ప్రియముకాదు. ఆత్మయందున్న అనురాగమువలననే అది ప్రియమగుచున్నది. ఈ సూక్తియందు ప్రతి వస్తువును దాని రూపము, ఆకృతినిబట్టి ప్రియమగుట లేదనియూ, అందున్న ఆత్మ పదార్థమునుబట్టియే అది ప్రియమగుచున్నదనియూ తెలియుచున్నది. ఇక్కడ మరియొక అర్థమునుకూడ చెప్పుకొనవచ్చును. లోకమున మనము దేనినైన (వస్తువును) ప్రేమించుచున్నచో అది ఆ వస్తువునుబట్టి కాదు. మనయందున్న ఆత్మ యొక్క సంతృప్తికొరకే మనము దానిని ప్రేమించుచున్నాము. ఎప్పుడు ఆత్మ సంతృప్తినొందదో అప్పుడు పూర్వము ప్రేమించిన వస్తువులనైననూ మనము పరిత్యజించుచున్నాము.

7. భిద్యతే హృదయగ్రంధిః ఛిద్యంతే సర్వసంశయాః
క్షీయంతే చాస్యకర్మాణి తస్మిన్ దృష్టే పరావరే।

ఈ శ్లోకము ముండకోపనిషత్తునందలిది. ఇక్కడ ఆత్మలాభ సంపన్నుడైన వాని స్వభావమునుగూర్చి చెప్పుచున్నాడు. "సర్వవ్యాపియైన యా ఆత్మపదార్థమును ఎవ్వడెరుగునో అతని హృదయగ్రంధి భేదింపబడుచున్నది. అతని సర్వ సంశయములు ఛేదింపబడుచున్నవి. అతని కర్మములు క్షీణించుచున్నవి."

ఈ శ్లోకమున ఆత్మజ్ఞుని లక్షణములు చెప్పబడినవి. అతడు బౌద్ధికమైన, మానసికమైన, సంశయములకు గురి కాడు. ఈ ప్రపంచమున అతడు చేయవలసిన విధులు లేవు. అతడు జీవించియున్ననూ ముక్తుడే. ఇట్టివారే జీవన్ముక్తు లన బడుదురు.

8. ద్వాసు పర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే।
తయోరన్యః పిప్పలంస్వాద్వత్తి అనశ్నన్నన్యో అభిచాకశీతి ॥

ఈ శ్లోకము ముండకోపనిషత్తునుండి గ్రహింపబడినది. ఇక్కడ జీవాత్మ యొక్కయూ, పరమాత్మయొక్కయు స్వరూప స్వభావములు అలంకారికముగా నిరూపింపబడినవి. "ఎప్పుడు విడివడనట్టియూ, పరస్పరము స్నేహితులైనట్టియూ, మంచి వర్ణముగల రెక్కలుగలట్టియూ రెండు పక్షులు ఒకేవృక్షమును ఆశ్రయించి యున్నవి. అందు ఒకటి తియ్యనైన పిప్పలఫలమును తినుచున్నది. మరియొకటి అట్లు చేయక తూష్ణీంభావమును కలిగియున్నది." ఇక్కడ పక్షుల వృత్తాంతమును చెప్పుటద్వారా జీవాత్మ పరమాత్మల భేదము వివరింపబడినది. జీవాత్మ అనగా జీవుడు సుఖదుఃఖ రూపఫలముల ననుభవించును. శ్లోకమున చెప్పబడిన మొదటి పక్షి జీవుడు. ఇక, పరమాత్మ సుఖదుఃఖాద్యతీతుడై కేవలము ఉదాసీన భావముతో నుండును. శ్లోకమున చెప్పబడిన రెండవ పక్షి పరమాత్మ. అతడే సాక్షియనియూ చెప్పబడుచున్నాడు.

9. నాయమాత్మా ప్రవచనేనలభ్యోన మేధయా న బహునా శ్రుతేన।
యమే వైషవృణుతే తేన లభ్యస్తస్యైష ఆత్మా వివృణుతేతనూం స్వామ్ ॥

ఈ శ్లోకముకూడ ముండకోపనిషత్తునుండి గ్రహింపబడినది. ఇక్కడ ఆత్మ సాక్షాత్కారము వేదాధ్యయనముపలగానీ, బుద్ధికుశలతవలనగానీ వేదాధ్యాపనము వలనగానీ లభ్యము కాదని చెప్పబడినది. "ఆత్మ సాక్షాత్కారము వేదాది పుణ్యవాఙ్మయాధ్యయనమువలనకాని బుద్ధివలనగనీ, బహుముఖపాండిత్యమువలనగానీ లభ్యము కాదు – ఆ ఆత్మ ఎవ్వని అనుగ్రహించునో అతడే ఆత్మ సాక్షాత్కారము నంద గలడు – అతనికే ఆత్మ తన స్వరూపమును వివరించును."

ఈ శ్లోకమున ఆత్మార్థియైనవాడు ఎంత పరిశ్రమించిననూ ఆత్మ సాక్షాత్కారము పొందనేరడనియూ, ఆ ఆత్మ ఎవని అనుగ్రహించునో అతడే దానికర్హుడనియూ చెప్ప బడినది. అనగా దైవసహాయములేని కేవల పురుష ప్రయత్నమువలన గమ్యమును చేరలేమని భావము.

10. యస్యదేవే పరాభక్తిః యథా దేవే తథా గురౌ।
తస్యైతే కథితాహ్యర్థాః ప్రకాశంతే మహాత్మనః ॥

ఈ శ్లోకము శ్వేతాశ్వతరోపనిషత్తునందలిది. ఇచట గురుభక్తియొక్క ప్రాశస్త్యము చెప్పబడినది. "ఎవనికి దేవునియందు అత్యుత్తమైన భక్తి కలదో, అట్టి భక్తియే గురువునందునూ కలదో అతనికిమాత్రమే ప్రతిపాదింపబడిన విషయములు ప్రకాశించును. అనగా బుద్ధి గోచరములగును." గురుభక్తిలేని అధ్యయనమువలన ఫలము శూన్యము— గురుభక్తి లేనివానికి శాస్త్రవిషయములు అవగాహన కాజాలవు— కనుకనే గ్రంథ పఠనారంభమున గురుప్రార్థన చేయవలెను.

11. ప్రణవో ధనుః శరోహ్యాత్మా బ్రహ్మతల్లక్ష్యముచ్యతే।
అప్రమత్తేన వేద్ధవ్యం శరవత్తన్మయో భవేత్॥

ఈ శ్లోకము ముండకోపనిషత్తునందలిది. ఇచట జీవాత్మ పరమాత్మల ఐక్యము వివరింపబడినది. "ధనుస్సు ఓంకారము. జీవాత్మ బాణము. పరమాత్మ లేక బ్రహ్మము లక్ష్యము. ఇచట గురిచేయుట, లక్ష్యమును భేదించుట జాగరూకతతో నొనర్పవలెను. (అట్లు చేసినచో) బాణము లక్ష్యము ఏకమగునట్లు, జీవాత్మ పరమాత్మల ఐక్యము సంభవించును.

ప్రణవమే ఓంకారము. ఓంకారధ్యానమే ముక్తికి మార్గము. మనము దేనిని ధ్యానింతుమో అదియే మనమగుదుము. ఈ విషయమే యిచ్చట ధనుస్సు బాణముల దృష్టాంతముద్వారా వివరింపబడినది.

12. అసతో మా సద్గమయ। తమసో మా జ్యోతిర్గమయ।
మృత్యోర్మాఽమృతంగమయ॥

ఈ సూక్తులు బృహదారణ్యకోపనిషత్తునందలివి. ఇక్కడ మానవుని మూడు ఆశయములు చెప్పబడినవి. "నన్ను అసత్యమునుండి సత్యమును పొందించుము. చీకటినుండి జ్యోతిని పొందించుము. మృత్యువునుండి అమృతత్వమును పొందించుము."

దృశ్యమానమగు నీ ప్రపంచము అసత్యము. బ్రహ్మమే నిత్యము. కనుక ప్రపంచాతీతుడైన బ్రహ్మను పొందవలెనని జీవుని ఆశ. అట్లే అజ్ఞానము చీకటి, జ్ఞానము జ్యోతిరూపము. కనుక అజ్ఞానమును పారద్రోలి విజ్ఞానమును పొందవలెనని జీవుని అభిలాష. ఇదేవిధముగా శరీరభ్రాంతియే మరణము లేక మృత్యువు. బ్రహ్మానుభవము అమృతము లేక నిత్యము. కనుక జీవుడు తాను దేహభావనారహితుడై బ్రహ్మానుభవము నందవలెనని ఆశించుచున్నాడు.

# స్మృతులు - పురాణములు

## శ్రీ అప్పల్ల సోమేశ్వర శర్మ

పరిచయము : మనువు మహర్షి. మహాద్రష్ట. మానవతకు మూలపురుషుడు. రెండువేల సంవత్సరాలకు పూర్వం ఉండేవాడని చారిత్రికులు అంటారు. వాస్తవంగా ఇతని సమయం తెలుసుకోవడం కష్టం. వేదాలలో ఉండే ధర్మాలను స్మరించి, అందరికీ అందుబాటులో ఉండేవిధంగా సరళమైన సంస్కృతంలో వ్రాయబడిన గ్రంథాన్ని "స్మృతి" అంటారు. సమాజ శ్రేయస్సుకు ఉపయోగించేవి, వ్యక్తి వికాసానికి దోహదం చేసేవీ అయిన వేలకొలది ధర్మాలూ, ధర్మసూక్ష్మాలూ స్మృతులలో ప్రతిపాదింపబడి ఉన్నాయి. దేశకాలానుసారంగాను, చారిత్రకంగాను ఏవోకొద్ది మార్పులు జరిగినా – జరుగుతున్నా – జరుగనున్నా భారతీయత యొక్క మూలధర్మాలకు మాత్రం నాశం ఎప్పుడూ కలగదు. అట్టి మూలధర్మాలకు పెన్నిధి మనుస్మృతి. స్మృతులన్నింటికీ మూలం మనుస్మృతి.

అవతారిక : "అనుభవిస్తున్నకొలదీ కోరికలు అధికమవుతూనే ఉంటాయి" అని ప్రతిపాదన.

1. న జాతు కామః కామానాముపభోగేన శామ్యతి ।
హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏవాభివర్ధతే ॥ (2-94)

అర్థము : కోరికలను అనుభవిస్తూ ఉన్నందువలన – అవి ఎన్నడును అణగవు. నెయ్యితో మంటలు పెరుగునే కాని చల్లారవు.

వివరణము : అనుభవిస్తే కోరిక అణగిపోతుందని హేతువాదంతో కొందరన వచ్చు. కాని అది తత్త్వంకాదు. నిప్పు నీటితో చల్లారుతుంది. నేతితో చల్లారదు. ఆ విధంగానే నిగ్రహంవల్ల కోరిక క్రమంగా అణుగుతుంది. అనుభవంవల్ల అణగదు.

అవతారిక : "గౌరవించదగిన విషయాలు అయిదు" అని ఉపదేశం.

2. విత్తం బంధుర్వయః కర్మ విద్యాభవతి పంచమీ ।
ఏతాని మాన్యస్థానాని గరీయో యద్యదుత్తరమ్॥
(2-136)

అర్థము : ధనము, బంధుత్వము, వయస్సు, చేసేపని, చదువు – ఈ అయి

దున్ను గౌరవించదగినవి. వీనిలో కూడా వరుసగా ఒకదానికన్న ఒకటి గొప్పది (ముందు దానికన్న తరువాతిది గొప్పది).

వివరణము : డబ్బు మొదలయినవి అయిదూకూడా గౌరవించదగినవే. అయినా వానిలో వానికి పోటీవస్తే వెనుకనున్న దానినిబట్టే గౌరవం అందజేయాలి. అనగా డబ్బుకన్న బాంధవ్యం గొప్పది. డబ్బు, బాంధవ్యంకన్న వయస్సు గౌరవించ దగ్గది. ఆ మూడింటికన్న – "చేసేవృత్తి" మాననీయం అవుతుంది. అన్నింటికన్నను విద్య అధికంగా ఆదరణీయం. కాగా సమాజంలోని వ్యక్తులకు ఆయా లక్షణాలను బట్టి గౌరవాన్ని ఇవ్వాలని తాత్పర్యం.

అవతారిక : "ధర్మం అంటే ఏమిటో" – సంగ్రహంగా నిర్వచనం.

3. ధృతిః క్షమాదమో ఒస్తేయం శౌచమింద్రియనిగ్రహః ।
ధీర్విద్యా సత్యమక్రోధో దశకం ధర్మలక్షణమ్॥

(6-92)

అర్థము : ఎల్లప్పుడు సంతృప్తి, సహనం, మనస్సును అరికట్టడం, దొంగ తనం చేయకపోవడం, శరీరాన్ని పరిశుభ్రంగా ఉంచుకోవడం, ఇంద్రియాలను అదుపులో ఉంచడం, నిశితమైన బుద్ధి, చక్కని చదువు, సత్యాన్ని పాటించడం, కోపం లేకుండా ఉండడం – ఈ పదిగుణాలున్ను "ధర్మం" అనిపించుకుంటాయి.

వివరణము : దేశకాలభేదం, జాతిమతభేదం – మొదలయిన ఎట్టి భేదం లేకుండా, మానవ మాత్రునికి ఉండవలసిన సుగుణాలు ఇవే. ధర్మాన్ని గురించి పెద్ద పెద్ద సిద్ధాంతాలు చేయనక్కరలేదు. ఈ గుణాలను అలవరచుకుంటే ధర్మ సారాన్ని ఆచరించినట్లే అవుతుంది.

అవతారిక : "సంతోషం సగం బలం" అన్న అంశాన్ని వివరించడం.

4. సంతోషం పరమాస్థాయ సుఖార్థీ సంయతో భవేత్ ।
సంతోషమూలంహి సుఖం దుఃఖమూలం విపర్యయః ॥

(4–12)

అర్థము : సంతృప్తితోను, నిగ్రహంతోను జీవితం గడపాలి. అప్పుడు నిజమైన సుఖం లభిస్తుంది. సుఖానికి మూలం సంతోషం. దుఃఖానికి మూలం సంతోషం లేక పోవడమే.

వివరణము : న్యాయబద్ధంగా ధనాన్ని సంపాదించి, దానితో సక్రమంగా జీవితాన్ని గడుపుతూ సంతుష్టితో ఉన్నట్లయితే సుఖం అరచేతిలో ఉన్నట్లే. అలా కాక "అదికావాలి – ఇదికావాలి" అని ఎప్పుడూ అర్రులు చాస్తూ ఉంటే, దుఃఖం వెంటాడక తప్పదు.

## పద్మపురాణము - వ్యాసుడు

పరిచయము : వ్యాసుడు మునిపుంగవుడు. వేదాలను విషయవిభాగంతో వింగడించడంవల్ల "వేదవ్యాసుడు" అన్న బిరుదం వచ్చింది. అసలుపేరు "బాదరాయణుడు." భారతీయ సంస్కృతికి ఇతడు మూలపురుషుడనవచ్చు. ఏడెనిమిదివేల సంవత్సరాల క్రిందటి మనిషి. చిన్నా – పెద్దా – మొత్తం నలభై పురాణాలు "వ్యాసుని వాఙ్మయం" అని పెద్దలు అంటారు. పురాణాలలోలేని విషయమంటూ సామాన్యంగా ఉండదు. పద్మపురాణం మహాపురాణాలలో ఒకటి.

అవతారిక : "అత్యాశ పనికిరాదు" అని హెచ్చరిక.

1. లోభాద్వినాశః సర్వేషామిహలోకే పరత్రచ ।
లోభాదకార్యమత్యుగ్రం విద్వానపి సమాచరేత్॥
(సృష్టిఖండము)

అర్థము : లోభంవల్ల ఈ లోకంలోను, పరలోకంలోను వినాశం కలుగుతుంది. పండితుడుకూడా లోభంవల్ల, ఒకప్పుడు ఘోరమైన పనులను చేస్తూ ఉంటాడు.

వివరణము : లోభం అంటే అత్యాశ. అత్యాశ కష్టనష్టాలను కలిగిస్తుంది. చదువూ సంస్కారం ఉన్నవారుకూడా, లోభంవల్లనే లోకోపద్రవమైన కార్యాలను చేస్తూ, తమకూ తోడివారికీకూడా ముప్పుతెచ్చిపెడుతూ ఉంటారు.

అవతారిక : "లోభం, ప్రమాదం, అతి విశ్వాసం – ఈ మూడున్నూ మంచి లక్షణాలు కావు" అని ఉపదేశం.

2. లోభాత్ ప్రమాదాద్విస్రంభాత్త్రిభిర్నాశో భవేన్నృణామ్ ।
తస్మాల్లోభం నకుర్వీత న ప్రమాదం న విశ్వసేత్॥
(సృష్టిఖండము)

అర్థము : అధికమైన ఆశ వల్లను, ఏమరుపాటు వల్లను, అతి నమ్మకంవల్లను వినాశం కలుగుతుంది. కాబట్టి లోభాన్ని ప్రమాదాన్ని అతివిశ్వాసాన్ని విడిచిపెట్టాలి.

వివరణము : పేరాశ, ఏమరిక, వెర్రినమ్మకం అన్నవి జీవితంలో కష్టాలకే దారితీస్తాయి కాని, సుఖలేశాన్ని కూడా కలిగించవు.

## భాగవతము - వ్యాసుడు

పరిచయము : వ్యాసుని పురాణమాలలో భాగవతం తలమానికం వంటిది. శ్రీకృష్ణకథామృతంతో నిండిన దివ్యభాండం ఇది. భక్తిమార్గాన్ని, అధ్యాత్మిక విజ్ఞా

నాన్ని జోడించిన రసమయ మహాకావ్యంగా దీనిని లెక్కపెట్టవచ్చు. "పోతన ధర్మమా" అని, భాగవతం తెలుగువారి నాలుకలపై నాట్యం చేస్తూఉంది.

అవతారిక : "పెద్దవారిని పిన్నవారు అనుసరించడం లోకధర్మం" అని వివరణ.

1. యద్య దాచరతి శ్రేయానితర స్తత్తదీహతే ।
సయత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే॥

అర్థము : సమాజంలో పేరు సంపాదించిన వ్యక్తి ఏది చేస్తే అది, మిగిలిన వారందరికీ ఒరవడి అవుతుంది. గొప్పవారు దేనిని ప్రమాణంగా తీసుకుంటే అదే అందరికీ ప్రమాణం అవుతుంది.

వివరణము : పెద్దలు నడిచినట్లే పిన్నలు నడుస్తారు. కాబట్టి ఇంట్లోగాని, సమాజంలోగాని యజమానులన్నవారు ఉత్తమంగాను, ఆదర్శప్రాయంగాను జీవిత రథాన్ని నడపుతూ ఉండాలి.

అవతారిక : ధార్మిక జీవనానికి యమనియమాలు అవసరం. "యమనియమాలు" అంటే ఏమిటి ? దీనికి సమాధానం ఇది.

2. ఏతేయమాః సనియమాః (11–19–33, 34, 35)

అర్థము : అహింస, సత్యపరిపాలన, దొంగతనం చేయకుండుట, ఏ విషయమందున్ను అత్యాసక్తి లేకుండుట, సిగ్గుగలిగిఉండుట, అత్యధిక సంపాదనను విడచుట, ఆస్తిక్యబుద్ధి, బ్రహ్మచర్యం, మితభాషణ, ధైర్యం, సహనం, నిర్భయత్వం, శరీరపరిశుద్ధి, మంత్రజపం, తపస్సు, హోమం, శ్రద్ధ, అతిథిసత్కారం, భగవంతుని పూజించుట, తీర్థయాత్రలుచేయుట, పరోపకారబుద్ధి, సంతృప్తి, పెద్దలను సేవించుట – ఇవి యమనియమాలు (శ్రీకృష్ణుడు ఉద్ధవునికి చెప్పిన మాటలు ఇవి).

వివరణము : వ్యక్తి వికాసానికీ, సమాజశ్రేయస్సుకూ కొన్ని కట్టుబాట్లు అత్యవసరం అవుతాయి. వాటినే యమాలనీ, నియమాలనీ, ధర్మాలనీ అంటూ ఉంటారు. వీటిని యథాతథంగా ఆచరిస్తే వ్యక్తి ఉన్నతుడవుతాడు. ఏ వ్యక్తికి ఆ వ్యక్తి ఉన్నతుడయితే, సమాజం సహజంగానే ఉన్నతంగా రూపొందుతుందిగదా! వ్యక్తిని సంస్కరించడం భారతీయ సంస్కృతిలోని సూక్ష్మతత్త్వం. దీనికోసమే వేదాలు, శాస్త్రాలు, పురాణాలు, కావ్యాలు – మొదలయిన ఉద్గ్రంథాలన్నీ పాటుబడ్డాయి.

# రామాయణము-మహాభారతము

శ్రీ జొన్నలగడ్డ ప్రభాకరశాస్త్రి

ఈ క్రింది శ్లోకములు వాల్మీకిమహర్షి వ్రాసిన శ్రీ మద్రామాయణమునుండి గ్రహింపబడినవి. హిందూసంప్రదాయమునను సరించి రామాయణము ఆదికావ్యము. దానిని రచించిన వాల్మీకి ఆదికవి. చారిత్రకులు వాల్మీకి క్రీస్తునకుపూర్వము మూడవ శతాబ్దపు ప్రాంతమువాడని చెప్పుదురు. రామాయణము మహాభారతము ఈరెండును ఇతిహాసములని చెప్పుదురు. సంస్కృతాలంకారికుల మతానుసారము రామాయణము శిఖరశ్రేణికి చెందిన ఐదారు ఉత్తమకావ్యములలోనొకటి. కొందరి మతమున సంస్కృతకావ్యములలోకెల్ల రామాయణమే మొదటపేర్కొనదగిన ఉత్తమ కావ్యము.

1. భర్తృశుశ్రూషయానారీ లభతేస్వర్గముత్తమమ్
అపియా నిర్నమస్కారా నివృత్తాదేవపూజనాత్.

అయోధ్యాకాండ 40.26

'సీతోపాటు నన్నుకూడ అరణ్యానికి తీసుకొనిపో' అని అభ్యర్థిస్తున్న కౌసల్యతో రాముడనినమాటలివి. దేవతాపూజలు నమస్కారాలుచేయక పోయినా భర్తృశుశ్రూష చేతనే స్త్రీ ఉత్తమమైన స్వర్గాన్నిపొందుతుంది.

2. అసఙ్కల్పితమేవేహ యదకస్మాత్ప్రవర్తతే।
నివర్త్యారంభమారబ్ధం నను దైవస్య కర్మతత్ ॥

అ.కా. 22-24

తన అరణ్యావాసమునుగురించి మనస్సు కష్టపెట్టుకొనుచున్న లక్ష్మణునితో రాముడన్నమాటలివి.

ఎవరైనా మొదటప్రారంభించిన కార్యాన్నిఆపుచేసి తలవనితలంపుగా ఉన్నట్టుండి మరోకార్యాన్ని ఆరంభించినట్లైతే అదినిస్సందేహంగా దైవంచేసిందే అవుతుంది.

3. శోకోనాశయతే ధైర్యం శోకోనాశయతేశ్రుతమ్।
శోకోనాశయతే సర్వం నాస్తిశోకసమో రిపుః ॥

అ.కా. 62-15

కౌసల్య దశరథునితో అనిన మాటలివి.

శోకంధైర్యాన్ని నాశనంచేస్తుంది. శోకంపాండిత్యాన్ని నాశనం చేస్తుంది. శోకం సర్వాన్ని నాశనంచేస్తుంది. శోకంతోసమానమైన శత్రువులేదు.

4. గురులాఘవమర్థానా మారంభే కర్మణాం ఫలమ్।
దోషం వా యోనజానాతి సబాలఇతిహోచ్యతే॥

అ.కా. 63-7

రాముడు అరణ్యవాసానికి వెళ్లినతరువాత కౌసల్యతో దశరథుడనిన మాటలివి.

ఆయాకార్యాలయొక్క గురులాఘవాలు గుణదోషాలు తెలిసికోకుండానే వాటిని ప్రారంభించే వాడిని లోకం బాలుడు అని అంటుంది.

5. నాత్మనఃకామకారోఽస్తి పురుషోఽయ మనీశ్వరః।
ఇతశ్చేతరతశ్చైనం కృతాన్తః పరికర్షతి॥

అ.కా. 105-15

ఈ క్రింది ఐదుపద్యములు రాముడు భరతుని ఉద్దేశించి చెప్పినవి. ఈ పద్యాల్లో జీవితం, బంధువులు, పురుషకారం-వీనినిగురించి రాముని అభిప్రాయాలు స్పష్టంగా చెప్పబడ్డాయి.

మనిష్యునకు తనయిష్టానుసారం ప్రవర్తించడం వీలుపడదు. అతడు అస్వతంత్రుడు. దైవం అతణ్ణి అటు ఇటు లాగుతూ ఉంటుంది.

6. సర్వేక్షయాన్తానిచయాః పతనాంతాః సముచ్ఛ్రయాః
సంయోగావిప్రయోగాంతా మరణాంతంచజీవితమ్॥

అ.కా. 105-16

అన్నిసంచయాలకి పరిణామం క్షయం. అన్నిఉన్నతులకు పరిణామం పతనం. అన్నిసంయోగాలకు పరిణామం వియోగం. అట్లాగే జీవించడానికి పరిణామం మరణం.

7. నన్దన్త్యుదిత ఆదిత్యే నందత్యస్తమితేరవౌ।
ఆత్మనో నావబుధ్యన్తే మనుష్యా జీవితక్షయమ్॥

అ.కా. 105-24

సూర్యోదయానికి ప్రజలు సంతోషిస్తారు. సూర్యాస్తమయానికీ సంతోషిస్తారు. తమజీవితకాలం తరగిపోతోంది అనివారు తెలిసికోలేకపోతున్నారు.

8. యథా కాష్ఠంచకాష్ఠంచ సమేయాతాం మహార్ణవే।
సమేత్యచవ్యపేయాతాం కాలమాసాద్యకంచన॥

ఏవం భార్యాశ్చ పుత్రాశ్చ జ్ఞాతయశ్చ వసూనిచ।
సమేత్య వ్యవధావన్తి ధ్రువోహ్యేషాం వినాభవః॥

అ.కా. 105–26,27

ఎల్లాగైతే మహాసముద్రంలో దుంగదుంగకలసికొని తరువాత కొంతకాలానికి విడిపోతాయో అలాగే భార్యలు పుత్రులు బంధువులు వస్తుసముదాయం కూడుకొన్న తరువాత విడిపోతాయి. వీటితో వియోగం అనేది తప్పనిసరి.

9. సత్యవాదీహ లోకేఽస్మిన్ పరమం గచ్ఛతిక్షయమ్।
ఉద్విజన్తే యథాసర్పాన్నరాదన్నతవాదినః॥

అ.కా. 109–12.



జాబాలి మహర్షితో రాముడన్నమాటలివి.

సత్యవాది అయినవాడు ఈలోకంలో అత్యున్నతమైన స్థానానికి పోతాడు. అబద్ధాలుచెప్పేమనిషి అంటే పామునుచూసినట్లు భయపడుతారు.

10. ఐశ్వర్యేవా సువిస్తీర్ణే వ్యసనేవాసుదారుణే।
రజ్జ్వేవ పురుషం బద్ధ్వా కృతాన్తః పరికర్షతి॥

సుందరకాండ 37–3

సీత హనుమంతునితో అన్నమాటలివి.

గొప్పఐశ్వర్యంలో ఉన్నా, లేక, అతిదారుణమైన ఆపదలో ఉన్నా, తాడుపెట్టి కట్టినట్లు విధిమనిషిని తనయిష్టంవచ్చినవైపుకు లాక్కెడుతుంది.

ఈ క్రింది పద్యములు మహాభారతమునుండి సేకరింపబడినవి. మహాభారతము చాలవిస్తృతమైన గ్రంథము. దీనియందు 18 పర్వములు, సుమారు లక్షశ్లోకములు కలవు. ప్రపంచకములోకెల్ల నిదిపెద్దగ్రంథము. హిందూసంప్రదాయము ప్రకారము ఇదివ్యాసునిచే రచింపబడినది. కాని ఆధునికులు ఇది ఒక కాలములో ఒక వ్యక్తిచే రచింపబడిన గ్రంథము కాదనియు మొదటచిన్న గ్రంథముగానుండి క్రమముగా నీస్థితిలోనికివచ్చినదనియు చెప్పుదురు. మహాభారతకాలము క్రీస్తునకు పూర్వము నాల్గవశతాబ్దమునుండి క్రీస్తుతరువాత నాల్గవశతాబ్దమువరకు అభివ్యాపించి యున్నదని వారి అభిప్రాయము. సంస్కృతసంప్రదాయమున ఉత్తమశ్రేణి కావ్యములుగా పరిగణింపదగిన ఐదారింటిలో మహాభారతమొకటి. మహాభారతము కావ్యముగాను శాస్త్రముగాను కూడ పరిగణింపబడుచున్నది. అతిప్రసిద్ధమైన భగవద్గీత మహాభారతమునందలి ఒకభాగము. మహాభారతమును పంచమవేదమని చెప్పుదురు.

1. త్యజేదేకం కులస్యార్థేగ్రామస్యార్థేకులం త్యజేత్।
గ్రామం జనపదస్యార్థే ఆత్మార్థే పృథివీం త్యజేత్॥

ఆదిపర్వం 150–38

కుల శ్రేయస్సు కొరకు దుర్యోధనుని విసర్జింపమని చెప్తూ విదురుడు ధృతరాష్ట్రునితో అన్నమాటలివి.

కుటుంబంకోసం ఒకవ్యక్తిని విడిచిపెట్టాలి. గ్రామంకోసం ఒకకుటుంబాన్ని విడిచిపెట్టాలి. దేశంకోసం ఒకగ్రామాన్ని విడిచిపెట్టాలి. ఆత్మసాక్షాత్కారంకోసం ప్రపంచాన్ని విడిచిపెట్టాలి.

2. అహన్యహని భూతాని గచ్ఛన్తి యమమన్దిరమ్।
శేషాస్థిరత్వమిచ్ఛన్తి కిమాశ్చర్యమతః పరమ్॥

అరణ్యపర్వం 311–114

ఈ పద్యము దీనితరువాతి పద్యము ఈరెండు యుధిష్ఠిరుడు యక్షుని ఉద్దేశించి చెప్పినవి.

ఇవి యక్షునిప్రశ్నలకు జవాబులు :
ప్రతిరోజూప్రాణులుయమలోకానికి పోతూనేఉంటారు. అయినా మిగిలినవారు స్థిరముగా ఉండాలని కోరుకుంటారు. ఇంతకంటె ఆశ్చర్యం ఏముంటుంది.

3. తర్కోఽప్రతిష్ఠః శ్రుతయోవిభిన్నా
నైకో మునిర్యస్యమతం ప్రమాణమ్
ధర్మస్య తత్త్వం నిహితం గుహాయాం
మహాజనో యేనగతః స పన్థాః

అరణ్యపర్వం 311–115

తర్కం దేన్నీ స్థాపించలేదు. వేదములు వేరువేరుగా ఉన్నాయి. ఏ ఒక్క ముని అభిప్రాయాన్ని పరమప్రమాణంగా తీసికొనేందుకు వీలులేదు. ధర్మం నిజస్వరూపం గుహలోదాక్కొనిఉంది. మహాత్ములు దేనిగుండా ప్రయాణంచేశారో అదేమార్గం.

4. శుభేన కర్మణాసౌఖ్యం దుఃఖంపాపేన కర్మణా
కృతం ఫలతి సర్వత్ర నాకృతంభుజ్యతే క్వచిత్॥

అనుశాసనపర్వం 6–10

ఈ మాటలు బ్రహ్మ వశిష్ఠునితో అన్నవి.

శుభకర్మచేత సౌఖ్యంవస్తుంది. పాపకర్మచేత దుఃఖంవస్తుంది. ఎల్లప్పుడు చేసింది ఫలితాలనిస్తుంది. ఎన్నడు చెయ్యంది అనుభవింపబడదు.

5. యాదుస్త్యజా దుర్మతిభిర్యానజీర్యతి జీర్యతః ।
యోఽసౌ ప్రాణాంతికో రోగస్తాం తృష్ణాంత్యజతఃసుఖమ్॥

అనుశాసనపర్వం 7–21

ఇది తరువాత రెండుపద్యములు భీష్ముడు యుధిష్ఠిరునితో అన్నవి.

దుర్బుద్ధికలవారికి తృష్ణవిడువరానిది. మనిషికి ముసలితనంవచ్చినా వానిలో ఉండే తృష్ణకుముసలితనంరాదు. ఇది ప్రాణాలుతీసే రోగం. ఈ తృష్ణను విడిచి పెట్టినవాడు సుఖపడతాడు.

6. ధనం ప్రాప్నోతితపసా మౌనేనా జ్ఞాంప్రయచ్ఛతి ।
ఉపభోగంతు దానేనబ్రహ్మచర్యేణ జీవితమ్॥

అనుశాసనపర్వం 57–10

మనిషితపస్సుచేత ధనాన్ని సంపాదిస్తాడు. మౌనాన్నిపాటించడం ద్వారా ఇతరులను ఆజ్ఞాపింపగలుగుతాడు. దానంచేయడంచేత భోగాలను అనుభవిస్తాడు. బ్రహ్మచర్యం అవలంభించడంద్వారా దీర్ఘాయుష్షును పొందుతాడు.

7. యద్యదిష్టతమంలోకే యచ్చాస్యదయితం గృహే ।
తత్తద్గుణవతే దేయం తదేవాక్షయమిచ్ఛతా ॥

అనుశాసనపర్వం 59–7

లోకంలోకెల్లా తనకేదంటేయిష్టమో, తనయింట్లోఉన్నవాటిల్లోతనకేది ప్రియమైనదో అదితనకెల్లప్పుడుఉండాలి అనికోరుకొనేవాడు, దానిని గుణవంతుడికి దానం చెయ్యాలి.

8. యత్పృథివ్యాం వ్రీహియవం హిరణ్యం పశవఃస్త్రియః ।
సర్వంతన్నాలమేకస్యతస్మాద్విద్వాఞ్శమంవ్రజేత్ ॥

అను.ప. 93–44

కశ్యపమహాముని మాటలివి.

ఈ భూమిమీదఉన్న వరి, బార్లీ మొదలగు ధాన్యాలు, బంగారం, పశువులు, స్త్రీలు, ఇవన్నీ ఒక్కమనిషికికూడసరిపోవు. కాబట్టిపండితుడైనవాడు మనోనిగ్రహాన్ని పాటించాలి.

9. నతత్పరస్య సందధ్యాత్ ప్రతికూలం యదాత్మనః ।
ఏషసంక్షేపతో ధర్మః కామాదన్యత్ప్రవర్తతే ॥

యుధిష్ఠిరునితో బృహస్పతి అన్నమాటలివి.

తనకు ఏదిప్రతికూలమో దానిని యితరులకు చేయరాదు. సంక్షేపంగా చెప్పాలంటే యిదే ధర్మస్వరూపం. యాగాదిరూపములైన ఇతరధర్మాలన్నీ ఏదో ఫలం పొందేందుకు చేయబడేవి.

10. శోకస్థానసహస్రాణి భయస్థానశతానిచ ।
దివసే దివసే మూఢమావిశన్తి, న పండితమ్ ॥

స్వర్గారోహణపర్వం 6-56

ఈ పద్యం మహాభారతంలోచాలాచోట్ల పఠింపబడింది. భారతసావిత్రియందున్న పద్యాల్లో యిదిఒకటి.

వేలకొలదిగా దుఃఖించవలసిన అవసరాలు, వందలకొలదిగా భయపడాల్సిన అవసరాలు మూర్ఖుడికి ప్రతిరోజూ కనిపిస్తూనేఉంటాయి. కానిపండితుడికికాదు.

# కాళిదాసు

డా॥ దెందుకూరి శివప్రసాద్

ప్రపంచ సాహిత్య చరిత్రలో కాళిదాస నామము అత్యద్భుతము, అత్యాశ్చర్యకరమున్ను. కాళికాదేవియొక్క సేవకుడు అనునది పేరునకున్న అర్థము. ఆయనయొక్క నామము సర్వులకు స్ఫూర్తిప్రదము. ఆయన సర్వాదరణీయుడు. ఉపమానములను కూర్చుటలో ఆయన సిద్ధహస్తుడు. అందువల్లనే "ఉపమా కాళిదాసస్య" అను ఆర్యోక్తి ప్రచారములోనికి వచ్చినది. కాళిదాసుయొక్క వ్యక్తిగత జీవనమునకు సంబంధించిన సమాచారము అత్యల్పముగా మాత్రమే తెలియుచున్నది. ఆయనకాలమునకు సంబంధించి వివిధమైన వాదోపవాదములున్నవి.

ఆయన ఏడు ప్రధానమైన రచనలను గావించెను. అందు మూడు నాటకములు, రెండు మహాకావ్యములు, ఒకటి ఖండ కావ్యము, మరియొకటి వర్ణనాత్మకము.

1. రఘువంశము : ఇందు 19 సర్గలున్నవి. రఘువంశపు రాజుల చరిత్ర వర్ణనీయాంశము. అయిదు సర్గలలో (10 to 15) రామచరిత్రము వివరింపబడినది. రఘువంశ కావ్యము కాళిదాస రచనలలోకెల్ల మకుటాయమానముగా పరిగణింపబడుచున్నది.

2. కుమారసంభవము : కుమారస్వామియొక్క జన్మవృత్తాంతము ఈ కావ్యముయొక్క కథావస్తువు. దేవతలకు బాధాకరుడుగా పరిణమించిన తారకాసురుని సంహారమునకై సేనానిని కోరి దేవతలు, "పార్వతీపరమేశ్వరులయొక్క సంతానమైన కుమారస్వామియే ఇందుకు తగినవాడని" తలంచి – పార్వతీపరమేశ్వరులయొక్క వివాహమునకు పూనుకొనుట, కుపితుడైన ఈశ్వరుడు తన కంటిమంటలచే మన్మథుని భస్మీకృతు నొనర్చుట, తుదకు పార్వతీపరమేశ్వరులకు వివాహమగుట మొదలగు విషయములు ఈ కావ్యమున ఆయా స్థలములలో రమ్యముగా వర్ణింపబడినవి.

3. అభిజ్ఞానశాకున్తలము : ఇది ఏడంకముల నాటకము. ఇందు దుష్యంతుడు శకుంతలయొక్క గాథ, భరతునియొక్క జన్మవృత్తాంతమున్ను అభివర్ణితములు.

4. మాళవికాగ్నిమిత్రము : ఇందు మాళవికయొక్క అగ్నిమిత్రునియొక్క ప్రేమగాథ వర్ణితము.

5. విక్రమోర్వశీయము : ఇందు దివ్యమానుషమైన గాథ వర్ణితమైనది. అది దివ్యురాలైన ఊర్వశి — మానుషుడైన పురూరవుడు — వీరియొక్క ప్రేమగాథ.

6. మేఘదూతము : ఇది ఖండకావ్యము. ఇందు నూటఇరువది శ్లోకము లున్నవి. ఒకానొక యక్షుడు కుబేరశప్తుడై ఒక వత్సరము భార్యావియోగము ననుభవించుచు రామగిరియందు నివాసమేర్పరచుకొనెను. ఆషాఢముయొక్క ప్రథమ దినమున వర్షాకాల మేఘమును కనుగొని దానిని తన సందేశహరునిగా నెన్నుకొని తన ప్రియురాలికి సందేశమంపుట ఇందలి కథావస్తువు. ఈ కావ్యము సందేశ కావ్యములకు నాందిగా భావింపబడుచున్నది.

7. ఋతుసంహారము : ఇందు భారతీయమైన ఋతువుల వర్ణన గ్రథితమైనది. అందు గ్రీష్మ, వర్షా, శరద్, హేమన్త, శిశిర, వసన్తర్తువులు 144 శ్లోకములలో మనోహరముగా వర్ణింపబడినవి.

అవ : స్వయంవర సమయమున హేమాంగదునిగూర్చి సునంద చెప్పిన మాటలను ఇందుమతి ఏవిధముగా పెడచెవినిబెట్టినదో ఈ క్రింది శ్లోకమున వివరింపబడినది :

ప్రలోభితా ప్యాకృతిలోభనీయా విదర్భరాజా వరజాతయైవమ్ ।
తస్మాదపావర్త తదూరకృష్టా నీత్యేవలక్ష్మీః ప్రతికూలదైవాత్ ॥

(రఘు.సర్గ 6. శ్లో. 58)

సౌందర్యముచేతమాత్రమే ఆకర్షింపదగిన ఇందుమతి (అనగా వర్ణనచే మాత్రము ఆకృష్టురాలు కాదని తాత్పర్యము) సునందయొక్క వర్ణనచేత ప్రలోభ పెట్టబడినను, నీతిచే బహుదూరము కొనిపోబడినప్పటికి విధి వక్రించినవానినుండి లక్ష్మిదూరమైనట్లుగా, వానినుండి (హేమాంగదునినుండి) తొలగిపోయెను.

కార్యసాధనకు నీతి ఉపయుక్తమే, కాని దైవానుకూల్యములేనిచో దానివల్ల పనులు జరుగవని తాత్పర్యము.

అజమహారాజు తన భార్యయైన యిందుమతియొక్క మరణసమయమున అనుభవించిన ఆవేదన యిందు వర్ణింపబడినది.

అవ : ఇందుమతియొక్క మరణము అజునిలో కల్గించిన మార్పు ఈ క్రింది శ్లోకములో వర్ణింపబడినది :

విలలాప స బాష్పగద్గదం సహజామప్యపహాయ ధీరతామ్ ।
అభితప్తమయోపిమార్దవం భజతే కైవకథాశరీరిషు ॥

(రఘు.స. 8 శ్లో. 43)

ఆతడు (అజమహారాజు) ధీరస్వభావుడైనను, తన ధైర్యమును విడనాడి, కన్నీటిని కార్చుచు గద్గదమైన కంఠముతో ఏడ్చెను. నిప్పుచే కాల్చబడిన ఇనుము

కూడ కరిగిపోవునుకదా ! అట్టియెడ ఆర్తులైన మానవుల విషయమేమి చెప్పవలయును ?
అవ : రఘుమహారాజు పుత్రునికి రాజ్యసంపద నిచ్చివేసి తనవానప్రస్థ జీవనమేవిధముగా గడిపెనో ఈ క్రింద వివరింపబడినది :

సకిలాశ్రమమన్త్య మాశ్రితో నివసన్నావసథేపురాద్బహిః ।
సముపాస్యత పుత్రభోగ్య యాస్నుషయేవా వికృతేన్ద్రియాశ్రియా ।
(రఘు. సర్గ 8 శ్లో• 14)

ఆతడు (రఘుమహారాజు) వానప్రస్థాశ్రమము నాశ్రయించినవాడై, పట్టణమునకు బయటగానున్న ప్రదేశములో నివసించుచున్నవాడై, ఇంద్రియములను జయించినవాడై, తనపుత్రునిచే అనుభవింపదగిన కోడలిచేతవలె, సంపత్తిచేత కూడ సేవింపబడెను.

వనమందు వసించిన రఘుమహారాజునకు, నీరు తెచ్చిపెట్టుట, పూజకై పూలు సమకూర్చుట మొదలగు కోడలుచేయునట్టి సేవలకన్నను భిన్నమైన సేవలయొక్క అపేక్ష యెట్లులేకపోయెనో అట్లే రాజ్యాభిషిక్తుడైన అజునికి (రాజ్యాది) సంపదలమీద కూడ అపేక్ష లేకపోయెను.

అవ : రామునకు పట్టాభిషేకముచేయ సంకల్పించిన దశరథునియొక్క మనోభూమిక ఇందు చక్కగా వర్ణింపబడినది :

తంకర్ణమూలమాగత్య పలితచ్ఛద్మనాజరా ।
కైకేయీ శంకయేవాహ రామేశ్రీర్న్యస్యతామితి ॥
(రఘు. సర్గ 12 శ్లో. 2)

వార్ధక్యము నెరసిన జుట్టను మిషతో దశరథునియొక్క చెవిచెంతను చేరి, కైకేయినుండి భయపడినదో యనునట్లుగా, రామునకు రాజ్యమునీయమని చెప్పినది.

దశరథుడు తన వార్ధకస్థితిని గుర్తెరిగినవాడై రామునకు పట్టాభిషేకము చేయ తలచెను. ఇందు దశరథునియొక్క ఈ అభిప్రాయము చక్కగా అభివర్ణింపబడినది. ఇందు కవియొక్క ఉక్తివైచిత్ర్యము పరకాష్ఠనందినది. ఇందలి ఉత్ప్రేక్ష సాటిలేనిది.

అవ : రామపట్టాభిషేకవార్త ప్రజల కెట్టి సంతోషమును కల్గించినదో ఈ క్రింది శ్లోకమున వివరింపబడినది.

సాపౌరాన్ పౌరకాన్తస్య రామస్యాభ్యుదయ శ్రుతిః ।
ప్రత్యేకం హ్లాదయాంచక్రేకుల్యేవో ద్యానపాదపాన్ ॥
(రఘు॥సర్గ॥12.శ్లో 3)

ప్రజల కత్యంత ప్రీతిపాత్రుడైన రామునియొక్క పట్టాభిషేకవార్త, పిల్ల

కాలువ ఉద్యానవనములోని ప్రతి వృక్షమును తడిపినట్లుగా, ప్రతిపౌరుని ప్రత్యేకముగా ఆనందపరచెను.

ఇచటి ఉపమానము అత్యంత శోభాదాయకమై యున్నది. ఒకే పిల్లకాలువ ఉద్యానవనములోని చెట్లన్నింటిని విడివిడిగా తడిపి చల్లబరచినట్లుగానే, రామపట్టాభిషేకమునకు సంబంధించిన ఒకే వార్త పౌరులనందరను ప్రత్యేకముగా ఆనందపరచెను.

అవ : రాజ్యముల జయించుటలో కుశునియొక్క కుమారుడైన అతిథి అనుసరించిన విధానమిందు వర్ణింపబడినది.

కాతర్యంకేవలానీతిః శౌర్యంశ్వాపద చేష్టితమ్ ।
అతఃసిద్ధిం సమేతాభ్యాముభా భ్యామన్వియేషసః॥

(రఘు॥ సర్గ 17. శ్లో 47)

పౌరుషహీనమైన రాజనీతి కేవలము పిరికితనము మాత్రమే, కేవలము పౌరుషము పశుచేష్టితమే. కావున ఈ రెంటియొక్క సమ్మేళనముతో ఆతడు విజయమును సాధింపనిశ్చయించెను.

ఇందు రాజుయొక్క తెలివితేటలు స్పష్టముగా వివరింపబడినవి.

అవ : రాజైన అతిథియొక్క ఋజువర్తనమిందు వర్ణింపబడినది.

అపథేన ప్రవవృతేనజాతూపచితో ఽపిసః ।
వృద్ధౌనదీముఖేనైవ ప్రస్థానం లవణామ్భసః॥

(రఘు॥ సర్గ॥ 17. శ్లో 58)

ఆతడు (అతిథి) ఎంతగా అభివృద్ధిని సాధించినను ఎన్నడును తప్పుత్రోవను నడవలేదు. సముద్రము ఎంతపోటులో నున్నను దానియొక్క ప్రస్థానము నదీముఖముగానేకదా!

ఇచ్చోట పొందుపరుపబడిన దృష్టాంతము చాలా సుందరమైనది. ఉన్నతస్థాయికి చెందిన కవికిమాత్రమే ఇట్టి దృష్టాంతమును పొందుపరచుట సాధ్యమగును.

అవ : కౌత్సుడు రఘుమహారాజుయొక్క ఈవిని ఈ క్రింది విధముగా కొనియాడుచున్నాడు.

స్థానేభవానేకనరాధిపస్స న్నకించనత్వం మఖజంవ్యనక్తి ।
పర్యాయ పీతస్యసురైర్హిమాంశోః కలాక్షయ శ్లాఘ్యతరోహివృద్ధేః॥

(రఘు॥ సర్గ 5. శ్లో 16)

ఓ రాజా! నీవు ఏకచ్ఛత్రాధిపుడవయ్యును యాగమును చేయుటవలన సంభవించిన దారిద్ర్యమునకు గురియైనాడవనుట ఎంతయును తగియున్నది. దేవ

తలు క్రమముగా పానముచేయుటవలన జనించిన చంద్రునియొక్క కళాక్షయము, వాటియొక్క వృద్ధికన్నను శ్లాఘ్యతరముకదా!

ఇందలి భావమేమన, ధర్మకార్యములకై ధనమును వెచ్చించుటచే కల్గిన దారిద్ర్యముకూడ వ్యక్తియొక్క గౌరవాభివృద్ధికే తోడ్పడును.

అవ: దుష్యంతుడు మొదటిసారిగా శకుంతలను చూచినప్పుడు మనసులో తలచిన విషయమును కాళిదాస మహాకవి ఈ క్రింది విధముగా వర్ణించినాడు.

అనాఘ్రాతం పుష్పంకిసలయమలూనంకరరుహై
రనావిద్ధం రత్నం మధునవమనాస్వాది తరసమ్ ।
అఖండం పుణ్యానాం ఫలమివ చతద్రూపమనఘం
నజానే భోక్తారంకమిహ సముపస్థాస్యతివిధిః॥

(అభ॥శా॥2.10)

ఈ బాల ఎవరును వాసన చూచియుండనిపూవు. గోళ్లతో నొక్కబడని చిగురు. రంధ్రముచేయనిమణి. ఎవ్వరును చవిచూచియుండని సరిక్రొత్తతేనె. ఆమె అందము అఖండమైన పుణ్యఫలము (అనగా పుణ్యము చేసినవారి ఫలము). ఈ అందమును అనుభవించుటకు బ్రహ్మ ఎవరిని నిర్ణయించియున్నాడో నాకు తెలియదుసుమా!

ఇందు ఎవరును ఉపయోగించని సరిక్రొత్త వస్తువులతో శకుంతలను చక్కగా పోల్చియున్నాడు. ఈమె కన్యయే యగుటచే ఆపోలిక చక్కగానున్నది.

అవ: వశిష్ఠునియొక్క శిష్యుడు భార్యావిరహదుఃఖితుడైన అజుని ఓదార్చుట ఇందువర్ణింపబడినది.

స్వశరీరశరీరిణావపిశ్రుత సంయోగ విపర్యయౌయదా ।
విరహఃకిమివానుతాప యేద్వదబాహ్యైర్విషయైర్విపశ్చితమ్॥

(రఘు॥ సర్గ॥ 8 శ్లో 89)

దేహి, దేహములుకూడ సంయోగ వియోగములను కల్గియుండుట తప్పనిసరి అయినపుడు, బాహ్యములైన ద్రవ్యములతో కల్గిన వియోగము విజ్ఞునకేవిధముగా బాధను కల్గించును?

ఆత్మకు నివాసస్థానమైన దేహముయొక్క వినాశముధ్రువమని తెలిసినవిజ్ఞుడు ఇతరములైన వస్తువులు నశించగా చూచి దుఃఖించరాదు అని తాత్పర్యము.

అవ: ఈ క్రింది శ్లోకము అజమహారాజును ఓదార్చు సందర్భములోని మరియొక శ్లోకము.

న పృథగ్జనవచ్ఛుచోవశం వశినాముత్తమగన్తుమర్హసి ।
ద్రుమసానుమతాం కిమన్తరం యదివాయౌ ద్వితయేపిలేచలాః॥

(రఘు॥ సర్గ॥ 8 శ్లో 90)

నిగ్రహము కల్గినవారిలోకెల్ల శ్రేష్ఠుడవైన ఓ రాజా! పామరునివలె దుఃఖము నకు లోనగుట తగినదికాదు. వాయువేగమునకు చెట్టు, పర్వతముకూడ సమా నముగా కదలిపోయినచో వాటికి భేదమేమి యున్నది?

కష్టములు కల్గినప్పుడు పర్వతమువలె నిశ్చలముగా, చలించకయుండుట ధీరులలక్షణము.

అవ.: దిలీప మహారాజు పరిపాలనను వర్ణించుచు కవి చెప్పిన మాటలు.

ద్వేష్యో౽పి సమ్మతః శిష్టస్తస్యార్తస్య యథౌషధమ్।
త్యాజ్యో దుష్టః ప్రియో౽ప్యాసీదంగుళీవో రగక్షతా॥

(రఘు.స. 1. శ్లో. 28)

దిలీప మహారాజు తన పరిపాలనలో శత్రువునైనను సరే సత్పురుషుడైనచో సమ్మతితో అంగీకరించెను. అదెట్లనగా రోగము వచ్చినవానికి ఔషధము (ఎంతచేదైన దైనను) ఇష్టమైనట్లుగా. తనకెంత యిష్టుడైనను సరే దుష్టుడైన వానినిమాత్రము దూరముగా త్రోసివేసెను. అదెట్లనగా మన వ్రేలు మనకెంత ప్రీతిపాత్రమైనను పాము కరచినచో అప్రియమై అది వదలివేయబడినట్లు.

ఇచ్చట కాళిదాసుయొక్క ఉపమానము ఎంత మనోహరముగా నున్నదో తెలియుచున్నది. రోగము వచ్చినవానికి చేదైనను ఔషధము తప్పదు, కనుక అది వానికి ప్రీతిపాత్రమే. అట్లే శత్రువైనను, శిష్టుడైనచో రాజునకు ప్రీతిపాత్రుడేయగును. పాముకాటుకు గురిఅయిన వ్రేలును, తెగవేసి పారవేయుట ఒకనాటి వైద్యవిధా నము. అట్లే బంధువైనను దుర్జనుని దూరముగా నుంచుట రాజనీతి.

అవ.: ఇందు కాళిదాసు దశరథుని వేటను వర్ణించెను.

అపితురగ సమీపాదుత్పతంతం మయూరం
నసరుచిరకలాపం బాణలక్షీచకార॥
సపదిగత మనస్కశ్చిన్న మాల్యానుకీర్ణే
రతివిగళితబన్ధే కేశపాశే సుకేశ్యాః॥

(రఘు.9.72)

దశరథుడు వేటాడుచున్నప్పుడు అనేక మృగములను చెండాడెను. కాని ఒక నెమలి తన రథతురగముల సమీపమునుండి పైకెగిరిపోవుచున్నను, అతడు తన బాణములను నెమలిపై ప్రయోగించలేదు. ఎందుకనగా ఆ నెమలి అందమైన పురి విప్పి తన యెదుట సాక్షాత్కరించినపుడు దశరథ మహారాజునకు రతికాలమునందు విడిపోయిన పెక్కు రంగులుగల పూలమాలలుగల తన భార్య కేశపాశము (కొప్పు) వెంటనే తలంపులోనికి వచ్చెను.

అవ.: పోలికచేతకూడ ఒకప్పుడు ఒక వస్తువుపై (ఉపేక్ష లేక) అపేక్ష కల్గు

చుండుట సహజము. దశరథ మహారాజునకు నెమలిని వేటాడగల అదను చిక్కి నను ఆ పురివిప్పిన నెమలిని చూచినప్పుడు తన రమణీమణి కొప్పు జ్ఞప్తికి రాగా దానిని బాణములతో కొట్టలేక పోయెనని భావము.

ఇందు కాళిదాసు భావనాబలము అతి సూక్ష్మమై అత్యంత రమణీయత నావిష్కరించుచున్నది.

అవ.: కాళిదాసు రఘుమహారాజు దిగ్విజయ యాత్రను వర్ణించు సందర్భము లోని శ్లోకము :

దిశిమందాయతే తేజో
దక్షిణస్యాం రవేరపి।
తస్యామేవ రఘోఃపాండ్యాః
ప్రతాపం నవిషేహిరే॥

(రఘు.స. 4. శ్లో. 49)

దిగ్విజయ యాత్ర చేయదలచిన రఘుమహారాజు తూర్పును జయించి దక్షిణదిక్కునకు తిరిగెను.

దక్షిణదిక్కునకు తిరుగుసరికి సూర్యునివంటి ప్రతాపవంతునకుకూడ కాంతి సన్నగిల్లునుగదా! కాని ఆ దిక్కునందే రఘుమహారాజు ప్రతాపమునుమాత్రము (దక్షిణదిక్కుననున్న) పాండ్యరాజులు ఏమాత్రము సహింపలేకపోయిరి.

అనగా సూర్యుడుకూడ చూపలేనంత ప్రతాపమును రఘుమహారాజు చూపెననియు, సూర్యుని ప్రతాపము నతిశయించిన ప్రతాపవంతులైన పాండ్యులనుగూడ రఘువు జయించెననియు తాత్పర్యము.

అవ.: కాళిదాసమహాకవి రఘువంశ రాజుల గుణగణములను కొనియాడుచు వ్రాసిన శ్లోకమిది.

త్యాగాయ సంభృతార్థానాం సత్యాయ మితభాషిణామ్।
యశసేవి జిగీషూణాం ప్రజాయై గృహమేధినామ్॥

(రఘు.స. 1. శ్లో. 7)

రఘువంశపు రాజులు దానధర్మములకొఱకే ధనమును సంపాదించిరి. (కాని కామోపభోగములకొఱకు కాదని యర్థము. వారి ధనసంపాదనను ముఖ్య ప్రయోజనము దానమని భావము). వారు మితభాషులు. ఎక్కువ మాట్లాడిన ఎక్కడ అసత్యము వచ్చిపడునోయని తక్కువ మాట్లాడుచుండిరి. (అంతేకాని గర్వముచేత ఇతరులతో తక్కువ మాట్లాడుచుండిరని అనుకొనరాదని భావము). ఆ వంశపు రాజులు కేవలము కీర్తికొరకే (శత్రువులను) జయింపగోరిరి కాని రాజ్యకాంక్షాదుల చేతమాత్రము కాదని యర్థము. (యశఃకాంక్ష తప్పులేనిది. భూలోకములో కీర్తి

యున్నంతకాలము స్వర్గాదిలోకములందు సుఖము కలుగునని శాస్త్రములు చెప్పు చున్నవికదా !) ఆ రాజులు కేవలము సంతానముకొరకే పెండ్లియాడి గృహస్థులైరి. కాని సుఖోపభోగములకొఱకు కాదు.

ఈ రీతిగ ధర్మప్రతిపాదన చేయుటయే కాళిదాస మహాకవియొక్క ప్రత్యేకత.

అవ.: పార్వతీదేవి శివుని పొందుటకు తపస్సు చేసిన సందర్భమున ఆమె తపోవిధానమును వర్ణించు సందర్భములోనిదీ శ్లోకము.

> స్థితాః క్షణం పక్ష్మసుతాడితాధరాః పయోధరోత్సే ధనిపాతచూర్ణితాః।
> వలీసాతష్యః స్ఖలితాః ప్రపేదిరే చిరేణనాభిం ప్రథమోద బిన్దవః
> (కుమా.సర్గ.5. శ్లో. 24)

పార్వతీదేవి తపస్సు చేసినప్పుడు ఆమెపై వర్షాకాలపు తొలకరి చినుకులు పడెను. అవి పడినవిధమును కవి ఈ క్రిందివిధముగ వర్ణించెను. పైనుంచిపడిన వర్షపుబిందువులు (ముందుగా) రెప్పలపై బడి ఒక్క క్షణకాలము రెప్పలమీది వెంట్రుకలపై ఆగినవట. (దీనివలన ఆమె నిండు యౌవనములో నున్నట్లు, అందు వల్ల ఆమె పక్ష్మములు దట్టముగా నున్నవని ధ్వనించుచున్నది). ఇంకను క్రిందకు దిగి క్రింది పెదవిని కొట్టినవట (అనగా క్రింది పెదవిపైకి జారినవి. "కొట్టుట" అని వర్ణించుటవల్ల పెదవుల మృదుత్వము ధ్వనించుచున్నది). అక్కడనుండి పాలిండ్లపై బడుటచే చూర్ణితములైనవట. (అనగా ఆమె పయోధరము లెంత కాఠిన్యము కల్గి యున్నవో తెలియుచున్నది). ఆపైన ఆ బిందువులు అమె పొట్టమీది ముడతలలో పడి జారిపడినవట. (దీనివలన యౌవనమునందలి పార్వతీదేవి ఉదరముపై వళులు తీర్చిదిద్దియున్నవని తెలియుచున్నది). ఆపై ఆ వళులలోనుండి ఎట్లో తప్పించుకొని ఎంతో కాలమునకుగాని ఆ వర్షబిందువులు ఆమె నాభిలో చేరలేదట. (అనగా ఆ బిందువులు నాభిలో చేరినవేగాని మరల బయటికి వెలువడినట్లు చెప్పకపోవుటచే ఆమె నాభి యౌవనముచే ఎంత లోతుగా ఉన్నదో వ్యంగ్య మర్యాదచే తెలియు చున్నది).

గమనిక : యౌవనమునందున్న స్త్రీలకు పక్ష్మములు దట్టముగా నుండును. ఉదరముపై వళులేర్పడును. నాభి లోతెక్కును. ఇది సహజము. దీనిని కవి చమ త్కారముగా వర్ణించినాడు.

పై వర్ణనవల్ల పార్వతి తపశ్చర్యలో యోగాసనము వేసి నిదానముగా కూర్చుం డినట్లు స్ఫురించుచున్నదని కొందరభిప్రాయపడిరి.

అవ. : ఇందుమతి తన స్వయంవరకాలములో రాజులను వరుసగా సంచ రించుచు వచ్చి అంగరాజును గూర్చి తన చెలికత్తె చెప్పగా వినినప్పుడు కాళిదాసు ర్ణన ఈ క్రింది విధముగానున్నది :

అథాంగ రాజాదవతార్య చక్షుర్యాహీతి జన్యామవదత్కుమారీ।
నాసౌనకామ్యో నచవేదసమ్యగ్ద్రష్టుం నసాభిన్నరుచిర్హిలోకః॥
(రఘు. స. 61 శ్లో. 30)

ఆ తరువాత అంగదేశపు రాజునుండి తన దృష్టిని మరలించి ఇందుమతీదేవి తన చెలికత్తెయగు సునందను రాజసభలో ముందుకు సాగిపొమ్మని చెప్పెను. (ఆ అంగరాజు సామాన్యుడా ?) ప్రేమింప తగినవాడు కాకపోలేదే ? (ఆ యిందుమతీ దేవియో) గుణాగుణ విమర్శ చేయలేని తెలివితక్కువదా ? కాదు (మరి ఆమె స్వయంవరములో ఆతని నెందుకు వదలి ముందుకు సాగిపోయినదందురా) — "భిన్నరుచిర్హిలోకః" ఎవరియిష్టమువారిది. దానికి హేతువులేదు.

ఇట్టివి కాళిదాసు వాక్యములు లోకోక్తులై ఇప్పటికిని వాడబడుచున్నవి.

అవ. : మన్మథ సంహారమైనప్పుడు ఆతని భార్య రతీదేవియొక్క విలాప ప్రకారమును వర్ణించు మట్టములోనిదీ శ్లోకము :

శశినాసహ యాతికాముదీ సహమేఘేన తడిత్ప్రలీయతే।
ప్రమదాః పతివర్త్మగాఇతి ప్రతిపన్నం హివిచేతనైరపి॥
(కుమా. స. 4 శ్లో. 33)

చంద్రునితోపాటు ('శశిన్' శబ్దము పుంలింగమైనందున ఒక పురుషుడు అను అర్థము ధ్వనితమౌచున్నది) కౌముది (వెన్నెల) (స్త్రీలింగ శబ్దమైనందున స్త్రీ అనగా ఆతని భార్యయని ధ్వనితమగుచున్నది) యనుతరలిపోవునుగదా ! అట్లే మేఘునితో పాటు విద్యుల్లతయును విలీనమైపోవును. స్త్రీలెప్పుడు భర్తలను వదలి యుండరని జీవము (చైతన్యము) లేని వస్తువులుకూడ తెలియజేయుచున్నవే. (నేనును అట్లే ఓ మన్మథా ! నిన్ను అనుసరించి వచ్చెదనని రతి విలపించుచున్నది).

ఇందు అచేతన వస్తువులను స్వీకరించి కవి విషయమును చమత్కారముగా వర్ణించుట గమనించతగినవిషయము.

అవ. : చంద్రుడు సుందరీమణుల ముఖపద్మావలోకమున చూపిన ఔత్సుక్య మిందు వర్ణింపబడినది.

సితేషుహర్మ్యేషు నిశాసుయోషితాం
సుఖప్రసుప్తాని ముఖాని చన్ద్రమాః ।
విలోక్యనూనం భృశముత్సుకశ్చిరం
నిశాక్షయే యాతిహ్రియేవపాండుతామ్ ॥
(రఘు. సర్గ. 1 శ్లో. 9)

రాత్రులయందు తెల్లటి హర్మ్యములయందు సుఖముగా నిద్రించుచున్న మనో

హరిణుల యొక్క ముఖములనుచూచి, చన్ద్రుడు మిక్కిలి ఖిన్నుడై, రాత్రి క్షీణించిపోగా, సిగ్గుచేతనువలె తెలవెలబారి పోవుచుండెను.

చంద్రుడు సౌందర్యరాశి. అతడుకూడ ఆ కాంతల ముఖములను చూచి సిగ్గు పడెను. అనగా ఆ ముఖములు చంద్రుని మించి యున్నవని వ్యంగ్యము.

అవ. : అజునియొక్క జన్మకు సంబంధించిన వార్తను వినిన రఘుమహా రాజు ఎంతగా ఆనందతరంగితుడాయెనో ఇందువర్ణింపబడినది.

జనాయ శుద్ధాంత చరాయశంసతే కుమారజన్మామృత సమ్మితాక్షరమ్ ।
అదేయమాసీత్త్రయమేవ భూపతేశ్శశిప్రభం ఛత్రముభేచచామరే॥

(రఘు.సర్గ. 3 శ్లో. 16)

కుమారోత్పత్తియను అమృతసమానమైన మాటలను చెప్పుచున్న శుద్ధాంత మందు తిరుగుచున్న పరిచారికాజనమునకు, బహుమతిగా ఈయరానివి రాజువద్ద (రఘుమహారాజువద్ద) మూడుమాత్రమే మిగిలినవి. అవి ఏవనగా చన్ద్రునియొక్క కాంతివంటి కాంతికల్గిన ఛత్రము, రెండు చామరములు.

తనకు కుమారుడు కల్గినాడన్న వార్త వినినతోడనే రఘు మహారాజు ఎంతగా ఆనంద తన్మయుడైనాడనగా, ఆ వార్తను తెల్పిన వారికి రాజ చిహ్నము లైన ఛత్రచామరములు తప్ప మిగిలినవాటి నన్నింటిని ఇచ్చివేసెను. దీనివల్ల రాజుయొక్క ఆనందముయొక్క పరకాష్ఠ ఎట్టిదో తెలియును.

అవ. : కాళిదాస మహాకవి రఘువంశపు రాజుల సద్గుణములను వివరించుచు చెప్పినమాటలు.

జ్ఞానేమౌనం క్షమాశక్తౌ త్యాగేశ్లాఘా విపర్యయః ।
గుణాగుణాను బంధిత్వాత్తస్య సప్రసవా ఇవ॥

(రఘు. సర్గ. 1 శ్లో. 22)

రఘువంశపు రాజులు ఎంత జ్ఞానము కలిగియున్నను మౌనము నవలంబించు చుండిరి. (ఎంత) శక్తికల్గియున్నను ఓర్పు చూపుచుండిరి. (ఎంత) త్యాగముచేసి నను పొగడ్తలను కోరకుండిరి.

సాధారణముగా జ్ఞానమున్నవాడు దానిని ప్రదర్శింపవలెనని తహతహలాడు చుండును, గర్వించుచుండును. కాని రఘువంశపు రాజులు మాత్రము ఎంత జ్ఞానమున్నను గర్వరహితులై మౌనమే అవలంబించుచుండిరి. అట్లే శక్తిగలవాడు సామాన్యముగ సాహసించి ఇతరులపై కత్తికట్టుచుండును. కాని శక్తికల్గియు రఘు వంశ రాజులు ఓర్పు చూపుచుండిరి. అట్లే దాన ధర్మ మాచరించువాడు పేరుప్రతి ష్ఠలకు అనేక విధముల బాధపడుచుందురు. కాని రఘువంశ రాజులు కీర్తి నెప్పుడును కోరలేదు.

అవ. : విశ్వజిద్యాగముచేసి తనకున్నదంతయు దానముచేసి, మట్టికుండతో (నీటితో) కాళ్లుకడిగి అర్ఘ్యము నిచ్చుటకు వచ్చిన రఘుమహారాజునుచూచి, పదు నాల్గుకోట్ల రూప్యముల ధనసహాయము కోరివచ్చిన కౌత్సుడను ఋషి చెప్పిన మాటలివి.

శరీరమాత్రేణ నరేంద్ర తిష్టన్నాభాసి తీర్థ ప్రతిపాదితర్ధిః ।
ఆరణ్యోకోపాత్త ఫలప్రసూతిః స్తంబేననీవారఇవావ శిష్టః ॥

(రఘు. 5 శ్లో. 15)

ఓ రాజేంద్రా! తగినవారికి ఉన్నదంతయు దానముచేసి (ఇక మిగిలిన దేమని పరిశీలించిచూడగా) ఒక్క శరీరము మాత్రముతో మిగిలియున్న నీవు నివర ధాన్యపు కంకిలోని ధాన్యమునంతయు అరణ్యకులు కోసివేసికొనగా మిగిలిన వట్టి కాడవలె ప్రకాశించుచున్నావని కవి వర్ణించెను.

ఇచ్చట రఘువుయొక్క దానగుణమును నివర ధాన్యపుకంకి యందలి ధాన్య మును అరణ్యకుల కిచ్చుటతో పోల్చుటవల్ల రఘువుయొక్క ఈవి ప్రతిఫలాపేక్ష లేనిదని ద్యోతితమగును.

అవ. : రఘుమహారాజు తనతండ్రియగు దిలీపుని మరపించెనని వర్ణించు సందర్భములోనిదీక్రింది శ్లోకము :

మందోత్కంఠాః కృతాస్తేన గుణాధిక తయాగురౌ ।
ఫలేనసహకారస్య పుష్పోద్గమ ఇవప్రజాః॥

(రఘు. సర్గ. 4 శ్లో. 9)

ఆ రఘుమహారాజు తండ్రికంటె గుణాధికుడగుటచే ప్రజలందరికిని రఘువు రాజ్యమునకు రాగానే అతని తండ్రియగు దిలీపునిపై అభిమానము తగ్గినదట. అది సహజమే. ఎట్లనగా మామిడిపండు పుట్టిన వెంటనే ప్రజలకు మామిడిచిగురుమీద ఉన్న ఉత్సాహము తగ్గునుగదా!

తండ్రిని మరపించిన సద్గుణములు గలవాడు రఘువని భావము.

అవ. : పురూరవుని వైతాళికుడు కీర్తించుట ఇందలి విషయము.

ఆలోకాన్తాత్ప్రతిహత తమోవృత్తిరాసాం ప్రజానాం
తుల్యోద్యోగస్తవ దినకృతశ్చాధికారోమతోనః ॥
తిష్ఠత్యేష క్షణమధిపతిర్జ్యోతిషాం వ్యోమమధ్యే
షష్ఠేభాగే త్వమపి దివ సస్యాత్మనశ్ఛన్దవర్తీ ॥

(విక్ర. అంక. 2 శ్లో. 1)

ఓ రాజా! నీయొక్కయు సూర్యునియొక్కయు అధికారము సమానమైన

పనియందు లగ్నమైనదిగా మాకు తోచుచున్నది. కారణమేమనగా నీవు నీ ప్రజల యొక్క తామసికప్రవృత్తిని తొలగించుచున్నావు, సూర్యుడు చీకటిని పారద్రోలు చున్నాడు (ఇచ్చట 'తమోవృత్తిః' అను పదము "తామసప్రవృత్తిని" "చీకటిని" అను నర్థముల నిచ్చుచున్నది). సూర్యుడు ఆకాశమధ్యమునందు క్షణకాల ముండును, నీవుకూడ నీ స్వేచ్ఛ ననుసరించి పగటియొక్క షష్ఠమ భాగమునందు విశ్రాంతిని గైకొందువు.

ఇందలి భావమేమన, సూర్యుడు ప్రపంచక్షేమము నాశించి విశ్రాంతి యెరుగక తన విధిని ఎట్లు నిర్వర్తించుచూ పోవుచున్నాడో, పురూరవుడుకూడ ఎట్టి సుఖభోగ ముల నపేక్షింపక తన ప్రజలయొక్క క్షేమమునకై సదా కార్యరతుడైయున్నాడు.

అవ. : హరదత్తుడు, గుణదాసులమధ్య పాండిత్యప్రకర్షకు సంబంధించిన వివాదమేర్పడినది. వారివారి సామర్థ్యములను నిర్ణయించు పని విదూషీమణియైన కౌశికి నిర్వహించవలసివచ్చెను. ఆ సందర్భములో కౌశికి తన భావము నీ విధముగా వివరించెను.

> శ్లిష్టాక్రియా కస్యచిదాత్మసంస్థా
> సంక్రాంతి రన్యస్య విశేషయుక్తా ।
> యస్యోభయం సాధు స శిక్షకాణాం
> ధురిప్రతిష్ఠాపయితవ్య ఏవ ॥

(మాళవిక. 1.16)

ఒకరియందు నటనాపాటవము తనకు మాత్రమే సీమితమై యుండును. ఇంకొకరియందు తాను నేర్చినదానిని ఇతరులకు నేర్పుటలో విశేషపాటవము కాన నగును. ఎవరియందైతే ఈ రెండు లక్షణము లుండునో ఆతడు ఉపాధ్యాయులలో కెల్ల శ్రేష్ఠమైన స్థానమునందుంచతగియున్నాడు.

వ్యక్తిగతమైన ప్రతిగుణమునకుకూడ జీవితములో సముచితస్థాన మున్న దనియు, తనకున్న శక్తులనన్నింటిని ఇతరులకు సంక్రమింపజేయగల్గుట సర్వోత్తమ మైన కార్యమని కవి ఇందు వ్యక్తముచేయుచున్నాడు.

అవ. : యక్షుడు తన సతీమణికి తన క్షేమమునకు సంబంధించిన వార్తలను పంపుటతోపాటు, భ్రాతికియుండిన సుఖములు బడయవచ్చునను ఆశను ప్రోత్స హించుచున్నాడు.

> నన్వాత్మానం బహు విగణయన్నాత్మనైవావలంబే
> తత్కల్యాణి త్వమపినితరాంమాగమః కాతరత్వమ్ ।
> కస్యైకాన్తం సుఖముపనతం దుఃఖ మేకాన్తతోవా
> నీచైర్గచ్ఛత్యుపరిచదశాచక్రనేమి క్రమేణ ॥

(మేఘ. 2. 111)

ఓ మంగళమయురాలా
ఊరడించుకోగల్గుచున్నాను.
శాశ్వతముగా సుఖముగాని
కమ్మివలెనే జీవితము క్రింది

వ్యక్తియొక్క జీవితవ
పోవునవిగా కాక, క్రమముగా
టకు చూపిన చక్రనేమియొ
భూతుడైనవానికి దుఃఖానం
యున్నది.

అవ. : కుబేరునిచే
దలచెను. కాని వార్తాహరుడె
భార్యావిరహవ్యథాతప్తుడైనం
యను జ్ఞానమును కోల్పోర
చేప్పవలసినదిగా కోరుట ఇం

జాతం వంశే భువన
జానామిత్వాం ప్రకృ
తేనార్థిత్వంత్వయి వి
యాచ్నామోఘా వరమ

ప్రపంచ ప్రఖ్యాతి ఐ
జనించినవానిగను, కామరూ
దును. అందువల్లనే నిన్ను
దూరమైపోయినాడను. (కో
నీడేర్చు గుణహీనుని యా

నీవు సద్వంశజుడేవై
తలచుచున్నానని భావము.

అవ. : రఘుమహా
యుండెనని వర్ణించుట ఈ

రూపం తదోజస్తతదే
న కారణాత్స్వాద్బి

(రఘువునకు) అదే

క్రమము. అదే స్వభావసిద్ధమైన ఉన్నతత్వము. ఒక దీపమునుండి వెలిగించిన మరియొక దీపమువలె ఈ కార్యకారణములకు (రఘుదిలీపులకు) ఏమాత్రమును భేదము లేదు.

నిజముగా కుమారుడు తండ్రిపోలియున్నాడని చెప్పుటకు దీపమునుండి పుట్టిన దీపము నుపమానముగా చెప్పుట గొప్ప ప్రతిభావిశేషము. అందును అగ్ని కున్న తేజస్సు మున్నగు గుణములు రెండవ దీపమునకూడ సంక్రమించెనా యని సందేహించ నవసరముండదు. మొదటి దీపమున్నట్లే కాంతివంతముగా దానితో వెలిగింపబడిన రెండవ దీపముండును. దానివలె అదియును దాహకశక్తిని కల్గి యుండును. దానివలె ఇదియు ఔన్నత్యము (పైకి జ్వాలలు ప్రజ్వలింపజెయుట) కల్గియుండునుగదా !

ఇంతటి అందమైన ఉపమానములు కావ్యమున కెంతశోభాకరములు.

అవ. : వంగదేశపురాజులను రఘుమహారాజు దిగ్విజయయాత్రలో ఎట్లు లొంగదీసినదీ వర్ణించుట.

ఆపాదపద్మ ప్రణతాః కలమా ఇవతేరఘుమ్ ।
ఫలైః స్సంవర్ధయా మాసురుత్ఖాత ప్రతిరోపితాః ॥

(రఘు.సర్గ. 4 శ్లో. 37)

ఒక్కసారి కలమధాన్యపు నారును పీకి మరల నాటినప్పుడు అవి ఎట్లు (కంకి పాదములపై పడునంత) సమృద్ధియైన పంటను పండించునో అట్లే, ఒక్కసారి రాజపదవులనుండి దింపివేసి మరల రాజ్యముల నిచ్చినప్పుడు ఆ వంగదేశపురాజులు రఘువు పాదపద్మములవరకు వంగి నమస్కరించి ఆతనిని ధనములతో సత్కరించిరి.

ఏరాజైనను గర్వించినప్పుడు వానిని ఒక్కమారు తొలగించి మరల రాజరిక మిచ్చినచో వాని గర్వమణగి కానుకలు మున్నగునవి తెచ్చి గౌరవించును. దీనికి ఊడ్పుచేసిన పంటతో సాదృశ్యము చెప్పుటచే కవి ప్రతిభావిశేషము తెలియ వచ్చుచున్నది.

అవ : సుఖోపభోగలోలుడై కాలక్షేపము చేయుచున్న చివరి రఘువంశపురాజు అగ్నివర్ణుని వర్ణించుచు కాళిదాసు చెప్పిన శ్లోకము.

అంకమంక పరివర్తనోచితేని న్యతురశూన్యా తాముభే ।
వల్లకీచ హృదయంగమ స్వనావల్గువాగ పిచవామలోచనా ॥

(రఘు॥ 9 స॥ శ్లో 13)

ఒడిలో కూర్చుండబెట్టుటకు తగినట్టి రెండు వస్తువులతో ఆ అగ్నివర్ణుని ఒడి ఎప్పుడును నిండియుండెను. అవేమనగా మనోహరస్వనముచేయు వీణయొకటి — మధురభాషిణియగు రమణియొకతె.

అంకములో దొరలించుటకు తగిన రెండు వస్తువులు, వల్లకి, వనిత – ఈ రెండును అతనికి నిత్యము అంకములో నుండెనని వర్ణించుటచే – అగ్నివర్ణుని నిత్య రతికేళి, సంగీత వినోదములు స్పష్టములగుచున్నవి.

అవ : కాశ్యపునిచే సమయమును గుర్తింప ఆజ్ఞప్తుడైన శిష్యుడు, ఆకాశమును చూచి తన మనస్సున కల్గిన భావము నీ క్రిందివిధముగా వివరించుచున్నాడు.

యాత్యేకతోऽస్తశిఖరం పతిరోషధీనాం
ఆవిష్కృతోऽరుణపురస్సరఏకతోऽర్కః ।
తేజోద్వయస్య యుగపద్వ్యసనోదయాభ్యాం
లోకోనియమ్యత ఇవాత్మదశాన్తరేషు ॥

(శాకున్త॥4.2)

ఒకవైపు ఓషధీశుడు అస్త్రాద్రి నధిష్ఠించుచున్నాడు. మరియొకవైపు అరుణపురస్సరుడై సూర్యుడుదయించుచున్నాడు. ఈ విధముగా తేజోద్వయమునకు ఒకే మారు కల్గుచున్న వ్యసనముచేతను, ఉదయముచేతను (చన్ద్రునకు వ్యసనము, సూర్యునకు ఉదయము) లోకము ఈ రెండు దశలయందు (వ్యసనోదయముల మధ్యన) బంధింపబడినట్లుగా తోచుచున్నది.

మర్త్యునియొక్క జీవితము సుఖదుఃఖభూయిష్ఠము, ఒకేసమయమున ఒకరికి ఉన్నతి ఒకరికి అవనతి కల్గుట లోకములో కనబడు విషయమను సత్యమును, సూర్యచన్ద్రులయొక్క ఉదయాస్తమయ దృష్టాంతముతో కవి చక్కగా వివరించినాడు.

అవ : ఈ క్రింది శ్లోకములో తన స్వయంవరమునకు వచ్చిన రాజుల నొక్కొక్కరిని ఇందుమతీదేవి వదలి ముందుకు సాగిపోయినప్పుడు వారెట్లు మనసునందు బాధపడిరో కవి వర్ణించెను.

సంచారిణీ దీపశిఖేవరాత్రౌ యంయం వ్యతీయాయ పతింవరాసా ।
నరేంద్రమార్గాట్ట ఇవప్రపేదే వివర్ణభావం ససభూమిపాలః ॥

(రఘు॥స॥6॥శ్లో 67)

ఇందుమతీదేవి, రాత్రియందు సంచరించుచున్న దీపశిఖవలె ఏ ఏ రాజును దాటి ముందుకు సాగిపోయెనో ఆ రాజు, రాజవీధిలో దీపము ముందుకు సాగిపోగా వెనుకనున్న ఒక్కొక్క గృహము వెలవెల పోయినట్లు, వెలవెలపోయెను.

ఒక గ్యాసులైటుతో ఒక వీధిలో పోవునప్పుడు ఆ లైటు దాటగానే ఒక గృహ మెట్లు వెలవెలపోవునో అట్లే ఇందుమతి తన స్వయంవరములో ఏయే రాజును దాటి ముందుకు సాగిపోయెనో ఆ రాజులందరు వివర్ణులై వెలవెల పోయిరని భావము.

"ఉపమా కాళిదాసస్య" అని ఉపమాలంకారమును సర్వాంగ సుందరముగా

చిత్రించు ప్రతిభ కాళిదాసునకే కలదని నిరూపించుటకు ఉపయోగపడు ఉదాహరణములలో దీనిని ముఖ్యముగా పేర్కొనవచ్చును. అందుచేతనే కాళిదాసునకు 'దీపశిఖా కాళిదాసు' అని కొందరు బిరుదము నొసంగిరి.

అవ: అత్యంత రసికుడై భోగపరాయణుడైన అగ్నివర్ణుడు ప్రియురాండ్రతో ఎట్లు ప్రవర్తించెనో ఇందు వర్ణింపబడినది.

> అంగుళీకిసల యాగ్రతర్జనం భ్రూవిభంగకుటి లంచవీక్షితమ్ ।
> మేఖలాభి రసకృచ్చ బంధనం వంచయన్ప్రణయ నీరవాపసః ॥
>
> (రఘు॥స॥19॥శ్లో 17)

తన ప్రియురాండ్రను వంచన చేసినప్పుడు (వచ్చెదనని మరియొక చోటికి పోవుట మున్నగు అకార్యములు చేసినప్పుడు) ఆ అగ్నివర్ణునకు ప్రియురాండ్రచే దండనలు విధింపబడెను. అవేవనగా – చిగుళ్లవంటి వ్రేళ్ల ముందరిభాగములచే భయపెట్టుట – కనుబొమ్మలు ముడివైచి చూచుట, మేఖలతో (గంటల ఒడ్డానముతో) మాటిమాటికి బంధించుట.

మన్మథ సామ్రాజ్యములో అపరాధము చేసిన ప్రియునికి కాళిదాసు విధింప జేయు శిక్షలివియే. శృంగారములో సుకుమారమైన శిక్షలేవి విధింప జేయవలయునో కాళిదాసువంటి రసికునికే తెలియునేమో ?

అవ: దుష్యంతుడు తన భార్యయొక్క వియోగమువల్ల కష్టముల ననుభవించి తుదకు భార్యాపుత్రులను కలసికొనిన శుభసమయమున మరీచిమహర్షిని చూచి ఆయనను స్తోత్రము చేయునప్పటి సందర్భములోనిదీ శ్లోకము.

> ఉదేతి పూర్వం కుసుమం తతఃఫలం ఘనోదయః ప్రాక్తదనన్తరంపయః।
> నిమిత్తనైమిత్తక యోరయంక్రమః తవప్రసాదస్య పురస్తుసంపదః ॥
>
> (అభి॥శాకుం॥ 7.30)

ఓ మహర్షీ! ఎక్కడనైనను ముందు పువ్వు పుట్టును. తరువాత ఫలము పుట్టును. ముందుగా మేఘములు కన్పించును. తరువాత వర్షము పడును. ఇది లోకములోని కార్యకారణ భావముల క్రమము. కారణము ముందు కార్యము తదనంతరము జరుగుచుండును. కాని మునీంద్రా ఇదేమిచిత్రము! నాకు రావలసిన సంపత్తులు (నా భార్యపుత్రులతో కలయిక) ముందు కల్గినవి. (అనగా కార్యములేక ఫలము, ముందు పుట్టినది) నీ అనుగ్రహము (నీ దర్శనభాగ్యము) (ఇది కారణము) తరువాత పుట్టినది అని భావము.

ఇచ్చట కార్యకారణములకు క్రమము తప్పినదని కవి వర్ణించుటచే మునీంద్రులయొక్క అనుగ్రహము కార్యకారణ భావక్రమమునుకూడ మార్చునది కాగలదని చెప్పి రమణీయత నాపాదించుచున్నది.

# భారవి-మాఘుడు

## శ్రీ అప్పల్ల సోమేశ్వరశర్మ

పరిచయము : సంస్కృతమహాకవులలో భారవి ఒకడు. క్రీస్తుశకం ఆరవ శతాబ్దం ఇతని సమయం. ఇతడు రచించిన "కిరాతార్జునీయము" ప్రముఖమైన మహాకావ్యం. ఇందులోని కథ మహాభారతంనుండి స్వీకరింపబడింది. అర్జునుని తపస్సు, కిరాతవేషంలోఉన్న శివునితో పోరాటం, పాశుపతాస్త్రాన్ని సంపాదించడం మొదలయినవి కథలోని ముఖ్యాంశాలు. గంభీరమైన అర్థాలను సుందరంగా విశదీకరించడంలో భారవి అగ్రతాంబూలం పుచ్చుకున్నాడు. "భారవేః అర్థగౌరవమ్" అన్న సూక్తి ఇతనివల్లనే ప్రచారం పొందింది.

అవతారిక : ధర్మరాజుకు దుర్యోధనునిపై కోపాన్ని కలిగించాలనే పట్టుదలతో, ద్రౌపది అన్నమాటలు.

1. వ్రజంతి తే మూఢధియః పరాభవం
భవంతి మాయావిషు యే న మాయినః।
ప్రవిశ్య, హి ఘ్నంతి శఠా స్తథావిధా
నసంవృతాంగాన్నిశితా ఇవేషవః॥

(1–30)

అర్థము : మాయావుల విషయంలో అమాయికంగాఉండే మానవులు, అవమానాన్ని పొందుతారు. కవచంలేని యోధుని శరీరంలో వాడిబాణాలు గుచ్చుకున్నట్లుగా, వంచకులు అమాయికులను అంటిపెట్టుకొని హింసిస్తారు.

వివరణము : మోసాన్ని మోసంతోనే (ఎదుర్కొని) జయించాలి. మోసగాళ్ళ ఎడల సరళప్రవృత్తి పనిచెయ్యదు. వంచకులు అమాయకులను "నల్లేరుమీద బండి" విధంగా నలిపి పారేస్తారు.

అవతారిక : మీదచూపిన సందర్భంలోనే ద్రౌపది అన్నమాటలు :

2. అవంధ్యకోపస్య విహంతురాపదాం
భవంతి వశ్యాః స్వయమేవ దేహినః।

అమర్షశూన్యేన జనస్య జంతునా
న జాతహార్దేన నవిద్విషాదరః ॥

(1-33)

అర్థము : కష్టనష్టాల్లో ఆదుకుంటూ కార్యసాధకమైన కోపంగల రాజుకు — లేదా — నాయకునకు ప్రజలుఎప్పుడూ విధేయులై ఉంటారు. తగినకోపంలేకుండా అసమర్థంగాఉండే నాయకుని విషయంలో జనులకు భయమూఉండదు—భక్తీ ఉండదు.

వివరణము : సముచితమైన సమయంలో కోపాన్నిచూపి, పట్టుదలతో కార్యాన్ని సాధించడం మంచిలక్షణమే. విచక్షణలేనికోపం, చేతకాని కోపం మాత్రమే చెడు లక్షణం అవుతుంది.

అవతారిక : "సాహసం, అవివేకంపనికిరావు" అని ధర్మరాజు పలికిన పలుకులు.

3. సహసావిదధీతనక్రియామవివేకః పరమాపదాంపదమ్ ।
వృణతేహివిమృశ్యకారిణం గుణలుబ్ధాః స్వయమేవ సంపదః ॥

(2-30)

అర్థము : తొందరతో ఏపని చేయకూడదు. అవివేకం అనర్థాలకు మూల కారణం. ముందూ వెనకా ఆలోచించి నిదానంగా పనిచేసేవ్యక్తిని సంపదలు స్వయంగా వరిస్తాయి.

వివరణము : అతితొందర, అవివేకం—ఈరెండూ ఆపదలను కలిగిస్తాయి. యుక్తాయుక్తవివేకంవల్ల సంపదలు సమకూరుతాయి.

అవతారిక : "శాంతమేముఖ్యం" అన్న అంశాన్ని ప్రతిపాదిస్తూ ధర్మరాజు అన్నమాటలు.

4. శుచిభూషయతి శ్రుతంవపుః ప్రశమస్తస్యభవత్యలంక్రియా ।
ప్రశమాభరణం పరాక్రమః స నయాపాదితసిద్ధిభూషణః ॥

(2-32)

అర్థము : శరీరానికి చక్కని పాండిత్యం అలంకారము. పాండిత్యానికి శాంతం అలంకారం. శాంతానికి పరాక్రమం అలంకారం. పరాక్రమానికి రాజనీతివల్ల కలిగే కార్యసిద్ధిఅలంకారం.

వివరణము : పౌరుషం-పరాక్రమం ముఖ్యమైనవే. కాని వివేకంతోకూడిన శాంతమే వానికిమూలంగా ఎప్పుడూ ఉండాలి.

అవతారిక : "శాంతంవంటిమంచిగుణం వేరొకటిలేదు" అని ధర్మరాజు తత్త్వము.

5. ఉపకారకమాయతేర్భృశం ప్రసవః కర్మఫలస్య భూరిణః ।
అనపాయినిబర్హణం ద్విషాం న తితిక్షాసమమస్తి సాధనమ్ ॥

(2–43)

అర్థము : జీవితంలో ఎప్పుడూ సహకరించేదీ, చేసినపనులకు మంచిఫలితాలను ఇచ్చేదీ, శత్రువులను చల్లగా చంపేదీ- శాంతమే. శాంతంవంటి కార్యసాధనం మరొకటిలేదు.

వివరణము : "శాంతములేక సౌఖ్యములేదు." శాంతమే సర్వార్థసాధకం. "శాంతమంటే చేతకానితనము" అనుకోవడంపొరపాటు.

అవతారిక : "కార్యసిద్ధికి పట్టుదల అవసరం" అని ద్రౌపది అర్జునుని ప్రోత్సహిస్తుంది.

6. యశోఽధిగంతు సుఖలిప్సయా వా
మనుష్యసంఖ్యామతివర్తితుం వా ।
నిరుత్సుకానామభియోగ భాజాం
సముత్సుకేవాంకముపైతి సిద్ధిః ॥

(3–40)

అర్థము : కీర్తిని పొందాలన్నా, సౌఖ్యాన్ని అనుభవించాలన్నా, అందరినీ మించి ఉండాలన్నా ఎడతెగని కర్తవ్యదీక్షఉండాలి. కార్యశూరులకు జయం "కరతలామలకం" (అరచేతిఉసిరికాయ =సిద్ధి) అవుతుంది.

వివరణము : "ఇలాచేదాం," "అలాచేదాం" అని ప్రణాళికలు ఎన్నివేసుకున్నా ప్రయోజనంఉండదు. ఉత్సాహం, పట్టుదల–ఈరెండింటితోను కార్యరంగంలోకిదూకాలి. ప్రయత్నంచేయాలి. అప్పుడు కీర్తి–ప్రతిష్ఠ మొదలయినవి వాటంతట అవే వస్తాయి.

అవతారిక : "ఇంద్రియ నిగ్రహం కర్తవ్యం" అని ఇంద్రుడు అర్జునునితో అన్న సందర్భం.

7. జీయంతాం దుర్జయాదేహేరిపవశ్చక్షురాదయః ।
జితేషునను లోకోఽయం తేషుకృత్స్నస్త్వయా జితః ॥

(11–32)

అర్థము : కన్ను, ముక్కు, చెవి మొదలయిన ఇంద్రియాలను జయించడం చాలాకష్టం. ముందుగా వాటినేజయించాలి. ఇంద్రియాలను జయిస్తే నీవుఅన్నిలోకాలను జయించగలవు.

వివరణము : ఇంద్రియాలను జయించడంఅంటే వాటిని అదుపులోఉంచు

కోవడం అన్నమాట. ఆపనివాస్తవంగా కష్టమే. అయినా ఇంద్రియ నిగ్రహంగలవ్యక్తి అన్నిపనులనూ చకచకాసాగించగలగుతాడు.

అవతారిక : "ఆత్మాభిమానంలేని బ్రతుకువ్యర్థం" అని అర్జునుడు ఇంద్రునితో అన్నమాట.

8. శక్తివై కల్యన్నమస్యనిస్సారత్వాల్లఘీయసః।
జన్మినోమానహీనస్య తృణస్యచసమాగతిః॥

(11–59)

అర్థము : శక్తిలేక వంగిపోయి, సారంలేకతేలికగా ఉన్న గడ్డిపరక బ్రతుకు వంటిదే ఆత్మాభిమానంలేనివాని బ్రతుకు.

వివరణము : గడ్డిపరకకు బలమూఉండదు–బరువూ ఉండదు. అందుచేతనే అందరూ దాన్ని అవమానిస్తారు. ఆ విధంగానే బలపరాక్రమాలూ ఆత్మాభిమానమూ లేని వ్యక్తిని అందరూ అవమానించే అవకాశంఉంది.

## శిశుపాలవధము — మాఘుడు

పరిచయము : మాఘుడొకమహాకవి. క్రీస్తుశకం ఎనిమిదవ శతాబ్దం ఇతని సమయం. ఇతని "శిశుపాలవధము" సంస్కృతమహాకావ్యాల్లోఒకటి. ఇందలికథ కూడా మహాభారతంనుండే గ్రహింపబడింది. ధర్మరాజు రాజసూయం, శ్రీకృష్ణునికి సత్కారం, శిశుపాలుని ఆగ్రహం, తుదకు శ్రీకృష్ణుడు శిశుపాలునిచంపడం–అన్నవి కథలోని ముఖ్యఘట్టాలు. సుందరమైన ఉపమానాలు, గంభీరమైన అర్థాలు, లలితమైన పదములున్ను మాఘకవితయందలి విశేషాలు. అందుచేతనే "మాఘేసంతి త్రయోగుణాః" అని సహృదయులంటారు.

అవతారిక : "ఆత్మాభిమానము, పౌరుషము–ఈ రెండూముఖ్యమని బలరాముడు అన్నమాటలు.

1. తుంగత్వమితరా నాద్రౌ నేదం సింధావగాధతా।
అలంఘనీయతాహేతురుభయం తన్మనస్విని॥

(2–48)

అర్థము : కొండకుఎత్తుఉంటుంది. లోతుఉండదు. సముద్రానికి లోతు ఉంటుంది. ఎత్తుఉండదు. పౌరుషం, ఆత్మాభిమానంగల మానవునికిఎత్తూ, లోతూరెండూ ఉంటాయి. కాబట్టి అతనిని ఎవరూఆక్రమించలేరు.

వివరణము : ఎత్తైనకొండలనూ, లోతైన సముద్రాలనూ ఆక్రమించి సాధించ

డం ఎంతకష్టమో, మానవంతుని జయించడం అంతకష్టం. అందుచేత ఆత్మాభిమానం అత్యవసరం.

అవతారిక : "పౌరుషమేగొప్పది" అని బలరాముని ప్రతిపాదన—

2. తేజస్విమధ్యే తేజస్వీ దవీయానపి గణ్యతే।
పంచమః పంచతపనస్తపనో జాతవేదసామ్ ॥

(2-51)

అర్థము : తేజస్సు (కాంతి-పౌరుషం) గలవ్యక్తి ఎంతదూరంలోఉన్నా, అతనికి లోకంలోపరిగణనం లభిస్తుంది. ఎంతోదూరంగాఉన్నా సూర్యుడు, పంచాగ్ని మధ్యంలో తపస్సుచేసేవానికి అయిదవఅగ్నిగా లెక్కకు వస్తాడు.

వివరణము : నాలుగువైపులానాలుగు అగ్నికుండాలుంచుకుని, మధ్యలో ఉండి తపస్సుచేస్తారు. సూర్యుడు అయిదవ అగ్నిగా లెక్కకువస్తాడు. ఈ తీరును "పంచాగ్నిమధ్యలో తపస్సు" అంటారు. కాగా దూరంగాఉన్నా సూర్యుడు తన తేజోబలంవల్లనే అయిదవఅగ్నిగా భావించబడుతున్నాడు. అ విధంగానే సహజ పౌరుషంగలవాడు ఎక్కడున్నా అతనికి సమాజంలో గొప్పస్థానం లభిస్తుంది.

అవతారిక : "శాంతముతో కూడినపౌరుషమే సముచితం" అని ఉద్ధవుడు ప్రతిపాదించిన సందర్భం.

3. మృదువ్యవహితం తేజోభోక్తుమర్థాన్ ప్రకల్పతే।
ప్రదీపః స్నేహమాదత్తే దశయాభ్యంతరస్థయా॥

(2-85)

అర్థము : మెత్తనివస్తువు ఊతగాఉన్న తేజస్సు ప్రయోజనాన్ని సాధిస్తుంది. మెత్తగాఉన్న వత్తినిఆధారంగా చేసుకున్నదీపం, నూనెను పీలుస్తూబాగా వెలుగుతుంది.

వివరణము : పౌరుషానికిముందు శాంతంఉండడం ముఖ్యం. శాంతంవల్ల వివేకం చెడిపోకుండాఉంటుంది. వివేకంతో ప్రయోగించిన పౌరుషంకార్యసాధకం అవుతుంది. వత్తిఉన్నదీపం సక్రమంగావెలుగుతుంది. వత్తిలేకపోతే విశృంఖలమైన మంటలులేచే ప్రమాదంఉంది.

అవతారిక : "దైవమూ, పౌరుషమూ రెండూకూడాముఖ్యమైనవే." అని ఉద్ధవుడు అన్నమాటలు.

4. నాఽలంబతేదైష్టికతాం న నిషీదతి పౌరుషే।
శబ్దార్థౌ సత్కవిరివ ద్వయం విద్వానపేక్షతే॥

(2-86)

అర్థము : పండితుడైనవాడు కేవలం దైవాన్నికాని, కేవలం పురుషకారాన్ని గాని నమ్ముకునికూర్చోడు. మహాకవి శబ్దార్థాలను రెండింటినీ స్వీకరించునట్లు, దైవ పౌరుషాలను రెండింటినీ అతడు ఆదరిస్తాడు.

వివరణము : కేవలం శబ్దంకాని కేవలం అర్థంకాని కవిత్వం అనిపించుకోదు. శబ్దార్థాలు రెండూకలిస్తేనే కవిత్వం అవుతుంది. ఆ విధంగానే దైవం, పురుషకారం, రెండూకలిసినప్పుడే పనులు సఫలం అవుతాయి. దైవపౌరుషాలు పరస్పరాపేక్షగలవి.

అవతారిక : సత్పురుషుని ముఖ్య లక్షణాలను ఉద్ధవుడు ఈ విధంగా సంగ్రహించినాడు.

5. తీక్ష్ణా నారుంతుదా బుద్ధిఃకర్మశాంతం ప్రతాపవత్।
నోపతాపి మనఃసోష్మవాగేకా వాగ్మినః సతః॥

(2–109)

అర్థము : సజ్జనునిబుద్ధి మంచిపదునుగలదై ఉండాలి. కాని పరులప్రేగులను కోసేదికాకూడదు. చేసేపని తేజోవంతంకావాలి. అయినా ప్రశాంతంగా జరగాలి. మనస్సు అభిమానంతోనిండిఉండాలి. కాని ఇతరులను బాధించేదిగా ఉండ కూడదు. మాట సుందరంగాను సమర్థంగాను ఉండాలి. అయినా అదిసత్యం కావాలి.

వివరణము : మనస్సు, మాట, పని–ఈమూడింటిని ఒకేవిధంగా నడిపించే శక్తిగలవారున్ను, శాంతమేభూషణంగా గలవారున్ను, సమయంవచ్చినపుడు ఉద్దండ పరాక్రమం చూపించగలవారున్ను సత్పురుషులనిపించుకుంటారు.

అవతారిక : సజ్జనుని స్వభావాన్ని, దుర్జనుని స్వభావాన్ని సాత్యకి వివరించి చూపినసందర్భం.

6. ఉపకారపరః స్వభావతః
సతతం సర్వజనస్య సజ్జనః।
అసతామనిశం తథాఽప్యహో!
గురుహృద్రోగకరీ తదున్నతిః॥

(16–22)

అర్థము : సజ్జనుడు సహజంగా ఎల్లప్పుడూ ఎల్లరకూ ఉపకారం చేస్తూ ఉంటాడు. అయినా అటువంటి సత్పురుషుని అభివృద్ధి దుర్జనునికి బాధాకరంగా పరిణమిస్తుంది.

వివరణము : పరోపకారమే సత్పురుషుని స్వభావం. దానివలన అతనికివచ్చే పేరుప్రతిష్ఠలనుచూచి, దుర్మార్గుడు కళ్లలోనిప్పులు పోసుకుంటాడు.

అవతారిక : "ఇతరులఅభివృద్ధినిచూచి ఈర్ష్యపడకూడదు" అని సాత్యకి ఉపదేశించిన మట్టం.

7. పరితప్యత ఏవ నోత్తమః
పరితప్తోఽ ప్యపరః సుసంవృతిః।
పరవృద్ధిభిరాహితవ్యథః
స్ఫుటనిర్భిన్నదురాశయోఽధమః॥

(16-23)

**అర్థము** : ఇతరుల అభివృద్ధినిచూచి, ఏవిధమైనబాధాపడకుండా ఉండే వాడు ఉత్తముడు. మనసులోకొంచెం బాధపడినా పైకి ఏ వికారమూ చూపించని వాడు మధ్యముడు. మనసులోబాగా బాధపడ, తన అసహనాన్ని అనేక వికారాలతో వెళ్ళగ్రక్కేవాడు అధముడు.

వివరణము : పరులఅభివృద్ధినిచూచి సంతోషించడం ఉత్తమలక్షణం. కొద్ది పాటి అసహనం కలిగినా దాన్ని అణచుకోవడం మధ్యమ లక్షణం. కలిగిన ఈర్ష్యను అసహనాన్ని దాచుకోలేక, వేయివిధాల వెలిబుచ్చడం అధమలక్షణం.

అవతారిక : "దుర్మార్గుల దూషణం వల్ల గొప్పవారి ఔన్నత్యంచెడిపోదు" అని సాత్యకి అన్నమాట.

8. వచనైరసతాం మహీయసో
నఖలు వ్యేతి గురుత్వముద్ధతైః।
కిమపైతి రజోభిరౌర్వరైః
అవకీర్ణస్య మణేర్మహార్ఘతా॥

(16-27)

**అర్థము** : దుర్జనుల దూషణములచే గొప్పవారి గొప్పతనము కుంటుపడదు. ధూళికప్పినంతమాత్రాన మణియొక్క విలువ తరుగదుగదా!

**వివరణము** : వేడినీళ్లు ఇళ్లనుకాల్చలేవు. మణియొక్కవిలువను ధూళి తగ్గింపజాలదు. అవిధంగానే తిట్లవల్ల గౌరవం ఎగిరిపోదు.

# భవభూతి

డా॥ పోచంచర్ల శ్రీరామమూర్తి

కాళిదాసుని తరువాత సంస్కృత సాహిత్యంలో గణుతి కెక్కిన మహాకవి భవభూతి. ఈయన ఎనిమిదవ శతాబ్దం ప్రథమ పాదంలోనివాడు. ఈయన తల్లి దండ్రులు నీలకంఠుడు జాతుకర్ణి. గురువు పరమహంసయైన జ్ఞాననిధియను సార్థక నామధేయుడు. నివాసస్థలము దక్షిణాపథములోని పద్మపురము. భవభూతి కాలప్రియ నాథుని భక్తుడు. ఇతని నాటకములు మూడున్నూ కాలప్రియనాథుని ఉత్సవ సంధ ర్భములో వ్రాయబడినవే. మహావీరచరితమున శ్రీరాముని కథ రావణవధ పర్యం తము వీరరసప్రధానముగ వర్ణింపబడినది. మాలతీ మాధవమను ప్రకరణమున మాలతీమాధవుల ప్రేమకథ మనోహరముగ చెప్పబడినది. ఇతని సర్వోత్తమ కృతి యగు ఉత్తర రామచరితము ఉత్తర రామాయణకథను కరుణరస ప్రధానముగ వర్ణించుచు సహృదయుల మన్ననల బడసినది. ఈ ఉత్తర రామచరితలో భవభూతి చూపిన ప్రతిభ అప్రతిమానమైనదని విమర్శకుల అభిప్రాయము.

"ఉత్తరేరామచరితే భవభూతి ర్విశిష్యతే"

1. తన మాలతీ మాధవంలో భవభూతి దండోపాయాన్ని అవలంబించే రాజు నీవిధంగా హెచ్చరించినాడు.

"అసాధ్య మన్యథా దోషం పరిచ్ఛి ద్య శరీరిణః ।
యథా వైద్యస్తథా రాజా శస్త్రపాణిర్భవిష్యతి"

మా.మా. 4.23

ఎవరి తప్పునైనా సరిగా తెలిసికొని దానిని మరేవిధంగాకూడ సరిదిద్దడానికి వీలులేదని నిశ్చయించుకొన్న తర్వాతనే రాజు వైద్యుడి మాదిరిగా శస్త్రాన్ని చేబూన డం మంచిది. వైద్యుడుకూడ రోగాన్ని మందులతో నయం చేయలేనప్పుడే శస్త్ర చికి త్సకు పూనుకుంటాడు.

2. ఈలోకం కవిత్వాన్ని, స్త్రీలనూ తప్పుపట్టడంలో ముందుకు ఉరుకుతుంది. లోకం మెచ్చుకునేలా కవిత్వం చెప్పాలన్నా కష్టమే. లోకం మెచ్చుకొనేలా ఏ

బోధించిన విషయాన్ని గ్రహించడంలో భేదంఉంది. మణి వస్తువును ప్రతిబింబించి నట్లుగా మట్టిముద్ద ప్రతిబింబింప చేయలేదుకదా !

5. మహాపురుషుల హృదయాలు అతిగంభీరంగా ఉంటాయి. వాటి లోతులను కనుక్కోవడం సాధ్యమయిందిగాదు. ఒకప్పుడు కఠినాతికఠినంగానూ మరొకప్పుడు పుష్పపేశలంగానూ ఉండగలవు. శ్రీరాముడు అట్టి మహాపురుషుడే !

వజ్రాదపి కఠోరాణి మృదూని కుసుమాదపి ।
లోకోత్తరాణాం చేతాంసికోను విజ్ఞాతు మర్హతి ॥

ఉత్తరరామచరిత 11.7

లోకోత్తరులైన మహాపురుషుల హృదయం వజ్రంకంటె కఠోరంగానూ, కుసుమంకంటె మృదువుగానూ ఉంటుంది. వారి హృదయస్థితిని ఎవరు తెలిసికోగలరు ?

6. దాంపత్య ప్రేమ రహస్యం పూర్తిగ అవగతం చేసుకున్న భవభూతి ఆ ప్రేమఫలం సంతానమే అని ఎంతో ఉచితంగా వర్ణిస్తాడు.

అన్తఃకరణ తత్త్వస్య దంపత్యోః స్నేహసంశ్రయాత్ ।
ఆనన్ద గ్రన్థిరేకోఽయ మపత్యమితి బధ్యతే ॥

సంతానమంటే భార్యాభర్తల ప్రేమపూరితమైన అన్తఃకరణసారములు పెనవేసికొని ఏర్పడే ఆనందరూపమైన ముడియే !

ఈ శ్లోకంలో భవభూతి భారతీయులలోని గార్హస్థ్య ధర్మానికి పరిణతి ప్రతిఫలం సంతానమే అని నిరూపిస్తాడు.

7. భవభూతి కరుణరసాన్ని వర్ణించడంలో అందరినీ మించాడు. ఆ కరుణరసాన్ని అన్ని రూపాలలో, అన్ని అవస్థలలో వర్ణించి రాళ్ళే కరగిపోయేటట్లు, వజ్రమే పగిలిపోయేటట్లుచేశాడు. కరుణరసంయొక్క వైవిధ్యాన్ని గూర్చి ఈ విధంగా అంటాడు :

ఏకోరసః కరుణఏవ నిమిత్త భేదాత్
భిన్నః పృథక్ పృథగి వాశ్రయతే వివర్తాన్ ।
ఆవర్త బుద్బుద తరఙ్గమయాన్ వికారాన్
అమ్భో యథా సలిలమేవహి తత్సమస్తమ్ ॥

ఉత్తరరామచరిత III, 47

ఒక్క కరుణరసమే అయాకారణాలవల్ల అయా రూపాలను పొందుతూ భిన్నవిభిన్నంగా గోచరిస్తూంటుంది. ఒకే నీరు సుడులుగా, బుడగలుగా, అలలుగా కని

స్త్రీ యైనా నడచుకోవాలన్నా కష్టసాధ్యమే! కాబట్టి మన కర్తవ్యం మనం పాటించడమే ధ్యేయంగా ఉండాలి.

"సర్వథా వ్యవహర్తవ్యం కుతోహ్యవచనీయతా ।
యథాస్త్రీణాం తథావాచాం సాధుత్వే దుర్జనోజనః ।

ఉత్తరరామచరిత 1.5

కవి తన కవిత్వం చెప్పతూనే ఉండాలి. తప్పులెన్న దలచినవారు తప్పులెన్నుతూనే ఉంటారు. స్త్రీల శీలం విషయంలో కవుల వాక్కు విషయంలో లోకం సాధారణంగా దోషారోపణ చేస్తుంది.

3. ఆదర్శదాంపత్యాన్ని గూర్చి మనోహరంగా వర్ణిస్తూ అట్టి దాంపత్యం ఎవరికో అదృష్టవంతులకే కాని లభించదని భవభూతి అంటాడు.

అద్వైతం సుఖదుఃఖయోరనుగతం సర్వాస్వవస్థాసు యద్
విశ్రామో హృదయస్య యత్ర జరసా యస్మిన్నహార్యోరసః ।
కాలేనా వరణాత్యయాత్ పరిణతే యత్స్నేహసారేస్థితం
భద్రంతస్య సుమానుషస్య కథమప్యేకంహి తత్ప్రార్థ్యతే॥

ఉత్తరరామచరిత 1.39

సుఖంలో దుఃఖంలో, వివిధములైన ఉచ్చనీచావస్థలలో ఒకేవిధంగా ఉంటూ, పరస్పర విశ్వాసంకలిగి వయస్సు వచ్చేకొద్దీ ప్రేమరసం క్షీణించకుండా, ప్రేమ సారంగా పరిణమిస్తూ అరమరికలు తొలగి పోవడంతో ఆదర్శప్రేమగా పరిణతిని పొందుతూ ఉండే నిజమైన దాంపత్యం ఏ అదృష్టవంతులకోగాని లభించదు.

4. గురువు విద్యార్థులందరికీ ఒకేవిధంగానే బోధించినా దానిని గ్రహించే విద్యార్థుల తెలివితేటల్ని బట్టి దాని ఫలితం భిన్నంగా ఉంటుంది. ఈ విషయాన్నే స్పష్టంగా భవభూతి వివరిస్తాడు :

వితరతి గురుః ప్రాజ్ఞే విద్యాం యథైవ తథాజడే
న ఖలుతయోర్జ్ఞానే శక్తింకరోత్యప హన్తివా ।
భవతిచ పునర్భూయాన్ భేదః ఫలం ప్రతితద్యథా
ప్రభవతి శుచిర్బిమ్బోగ్రాహే మణిర్నమృదాంచయః ॥

ఉత్తరరామచరిత II, 4

గురువు తెలివిగలవానికీ, తెలివితక్కువవానికీ ఒకే తీరుగా జ్ఞానబోధ చేస్తూంటాడు. వారి గ్రహణశక్తిని హెచ్చించడంగానీ, తగ్గించడంగానీ చేయడు. అయినా

షిస్తూ అంతా జలమయంగానే ఉంటున్నట్లే ఈ భిన్న రూపాల్లోగూడా ఒకే కరుణ రసం దీపిస్తూంటుంది.

భవభూతి యొక్క యీ శ్లోకాన్ని జీవితంలోని కరుణాన్ని వర్ణిస్తున్నట్లుగాను వ్యాఖ్యానించారు. మఱికొందరు కరుణమే అన్ని రసాలకూ మూలమనికూడా చెప్పారు.

8. నిజం చెప్పడం ఎన్నివిధాలుగానో మంచిది.

కామాన్ దుగ్ధే వి ప్రకర్షత్య లక్ష్మీం
కీర్తిం సూతే దుష్కృతం యాహినస్తి।
తాం చాప్యేతాం మాతరం మఙ్గలానాం
ధేనుం ధీరాః సూనృతాం వాచమాహుః ॥

ఉత్తరరామచరిత V. 31

సత్యవాక్కు కామధేనువు వంటిది. మన కోరికల నన్నిటినీ తీరుస్తుంది. అశుభాన్ని దూరం చేస్తుంది. కీర్తిని కలుగజేస్తుంది. పాపాన్ని తొలగిస్తుంది. అన్ని మంగళాలకూ కారణమైంది ఈ సూనృత వాక్కని ధీరులగు మహర్షులు చెప్పారు.

9. ప్రేమకు అనిర్వచనీయమైన ఆకర్షణ ఉంది.

వ్యతిషజతి పదార్థానాన్తరః కోఽపి హేతుః
నఖలు బహిరుపాధీన్ ప్రీతయః సంశ్రయన్తే।
వికసతిహి పతఙ్గస్యోదయే పుణ్డరీకం
ద్రవతిచ హిమరశ్మావుద్గతే చన్ద్రకాన్తః ॥

వస్తువునూ వస్తువునూ ఏదో అనిర్వచనీయమైన కారణం కలుపుతుంది. బాహ్య కారణాలతో ప్రీతులు కలిగినట్లుగా కనపడదు. సూర్యుడు ఉదయిస్తే కమలాలు వికసిస్తాయి. చంద్రుడు ఉదయిస్తే చంద్రకాంతశిలలు ద్రవిస్తాయి.

10. భవభూతి కవిత్వాన్ని మొదటలో పండితులు ఆదరించినట్లుగా కనపడదు. బహుశః అందుకే తప్పులెన్ను విమర్శకులను ఉద్దేశించి ఈవిధంగా చెప్తాడు :

యేనామకే చిదిహనః ప్రథయన్త్యవజ్ఞాం
జానన్తుతే కిమపి [illegible] యత్నః।
ఉత్పత్స్యతేఽస్తి
కాలోహ్యయం నిరవధిర్విపుల

మమ్మల్ని కొద్ది చూపుల

నేను కవిత్వం వ్రాయడంలేదు. మాతో హృదయ సంవాదం కలిగిన సహృదయులూ పుట్టకపోరు. ఇప్పుడూ అటువంటివారు ఎక్కడైనా ఉండవచ్చు. కాలము నిరవధిక మైంది. ఈ పృథివి విశాలమైంది.

11. భవభూతి మనం కార్యసాధకులం ఎలాకాగలమో ఈ విధంగా బోధి స్తాడు.

బహిఃసర్వాకార ప్రవణ రమణీయం వ్యవహరన్
పరాభ్యూహస్థానాన్యపి తను తరాణి స్థగయతి
జనం విద్వానేకః సకలమతి సంధాయ కపటై
స్తతస్థః స్వానర్థాన్ఘటయతి చమౌనంచ భజతే — మా.మా., 1.14

పైకి అన్నివిధాలా మనోహరమైన ప్రవర్తన కలిగి, మన అంతరంగం ఎవ్వరికీ తెలియనట్లుగా ఈ లోకంలో వ్యవహరించాలి. ఈ విధంగా నడచుకుంటూ వివిధ మైన ఉపాయాలతో పైకి తటస్థుడుగానే కనపడుతూ కార్యాలను సాధించుకోవాలి. మౌనంగానూ ఉండాలి.

# భర్తృహరి

శ్రీ వేదుల సుబ్రహ్మణ్యం

మహాకవి, వేదాంతి, దార్శనికుడు, వైయాకరణుడునగు భర్తృహరిని గురించు చారిత్రకాంశములేవియు స్పష్టముగ తెలియరాకున్నవి. ఈ విషయమున ప్రజా బాహుళ్యమునందు కేవలము సాంప్రదాయముగ వినవచ్చు కథలు, లేక గ్రంథాంతర పరిశీలనమువలన కల్గు ఊహాపోహలు తప్ప, విశ్వసనీయములగు అధారము లేవియును లేవు. ఈతని కాలము, వంశము మొదలగునవి యెట్లున్నను, ఈతని రచనలుమాత్రము స్థిరములై యున్నవి, అందు మొదటిది 'సుభాషిత త్రిశతి'. రెండవది "వాక్యపదీయము." ఇది సంస్కృత వ్యాకరణ మహాభాష్యమునకు శ్లోక రూప వ్యాఖ్య. ఇది ప్రధానముగ ఆర్థిక గ్రంథము. కొందరు పండితమ్మన్యులు "వాక్యపదీయకర్త" 'సుభాషితత్రిశతి' కర్తయు నొక్కరుగాదని చెప్పుచున్నను, ప్రాక్ ప్రతీచీ పండిత బృందముమాత్రము ఈ రెండు గ్రంథములు ఏక కర్తృకములే యని సహేతుకముగ నిరూపించినది. ఈతని కాలమునుగూర్చి యనేక వాదములున్నను, నేటి పండిత లోకమునందధికభాగము ఈతనిని క్రీ.శ. 7వ శతాబ్దము వానినిగ నిర్ణయించినది.

"సుభాషిత త్రిశతి" అను పేరు వినగనే ఇందు మున్నూరు సుభాషితములుండునని తెలియునుగదా! ఇవియన్నియు శ్లోకరూపమున నున్నవి. ఇందలి శ్లోకములను, "నీతిశతకము" "శృంగార శతకము" "వైరాగ్య శతక"మను రీతిని మూడు భాగములుగ వ్యవహరించుచున్నారు.

నీతిశతకము : శతకమనగ నూరు శ్లోకముల గ్రంథము. అయినను సాధారణముగ శతకమున నూట ఎనిమిది శ్లోకములుండుట పరిపాటియై యున్నది. ప్రకృతమున, ఈ నీతి శతకమందు మానవుడు పుట్టినది మొదలు నేర్చుకొనవలసిన యనేక విషయములును, నైతిక, సామాజిక జీవితపు విలువలును ప్రదర్శింపబడెను. సామాన్యముగ ప్రజల ప్రవర్తనా సరళిని, వారు అచరింపదగిన విధానములను భర్తృహరి చూపెను. చివరకు దైవముకంటె గూడ 'కర్మ' బలవత్తరమైనదనియు కావున సత్కర్మాచరణమే సర్వసౌఖ్యములకు మూలమనియు నిర్ధారించెను.

శృంగారశతకము : ఇందు కవి స్త్రీల అందచందములను స్వరూప స్వభావ

ములను కాముకుల మనఃప్రవృత్తిని వివరముగ చెప్పియుండెను. అక్కడక్కడ స్త్రీ వ్యామోహమును ప్రబలముగ వర్ణించుటద్వారా, విషయసుఖమె పరమావధిగ బోధించినట్లగుపడును. కాని కొంచెము లోతుగ పరిశీలించినచో, ఇతడు స్త్రీ వ్యామోహమును గర్హించుచు, చంచలమగు విషయసుఖములను నిరసించుట స్పష్టముగ కన్పట్టును.

వైరాగ్యశతకము : "సుభాషితత్రిశతి" యందలి మూడవభాగము వైరాగ్య శతకము. వైరాగ్యమనగ తనకున్న బాధ్యతలను వదలుట గాదనియు, సమాజ శ్రేయస్సునకై, స్వార్థమును, వ్యామోహమును, మమకారమును వదలి భగవదాదిష్ట మగు ధర్మకార్య నిర్వహణమునకైన తన బాధ్యతలను, భగవత్ప్రీతి పూర్వకము నాచరించవలెనని ఇది బోధించును. శరీరమందలి జవసత్త్వములు హరించుకొని పోకమునుపే, శాశ్వతానందమగు పరబ్రహ్మను ఉపాసించవలెనని ఈ శతకము ప్రతిపాదించును. సాకారోపాసననుండి క్రమముగ నిరాకారోపాసన ఇందలి సారాంశము.

గ్రంథశైలి – ప్రభావము : భర్తృహరి కవిత్వము సరసము, మృదులము, మనోజ్ఞము. సంస్కృతమున సామాన్య జ్ఞానము కలవారికిగూడ సులభముగ బోధపడునట్లుగ ఇతని రచనా శైలియున్నది. భారతీయ ప్రామాణిక జీవితమను నదెట్లుండునో ఈతడు స్పష్టముగ చెప్పియున్నాడు. ఈతని కవిత్వములోని మాధుర్యమును వాస్తవికతను గుర్తెరింగియే యీతని శ్లోకములను, సామెతలుగ నిత్యము పండితులు ఉట్టంకింతురు. ఇంతటి ప్రజాదరణ పొందిన గ్రంథముకనుకనే, దీనిని అనేకమంది కవులు అనేక భాషలలోనికి, ముఖ్యముగ తెలుగులోనికి అనువదించిరి. భర్తృహరి 'సుభాషితత్రిశతి' ప్రభావము తెనుగు శతకములపై మిక్కుటముగ నున్నదనుట యతిశయోక్తి గానేరదు.

అట్టి యీ గ్రంథమునుండి కొన్ని శ్లోకములు :

అవతారిక : భర్తృహరి యీ క్రింది శ్లోకమున దుర్జన సజ్జనుల స్నేహరీతులను వర్ణించెను.

> ఆరమ్భగుర్వీ క్షయిణీ క్రమేణ, లఘ్వీపురా వృద్ధిముపైతి పశ్చాత్ ।
> దినస్య పూర్వార్ధ పరార్ధభిన్నా ఛాయేవ మైత్రీ ఖలసజ్జనానామ్ ॥
>
> (నీతి శతకము – శ్లో.50)

తాత్పర్యము : దుర్జనులయొక్క చెలిమి ప్రొద్దుటిపూట నీడవలె మొదట హెచ్చుగనుండి క్రమముగ క్షీణించిపోవును. కాని సజ్జనుల మైత్రి యట్లుగాక మధ్యాహ్నకాలమందలి నీడవలె ప్రారంభమున కొద్దిగనుండి, క్రమక్రమముగ పెక్కలి యభివృద్ధి జెందును.

అనగా దుర్జనులు వారి స్వార్థములను పూర్తిచేసుకొనుటకు మనతో స్నేహము చేయుదురు. కనుక మొదటినుండియు అధిక స్నేహమును ప్రదర్శించి, వారి

కార్యము దీరినతర్వాత స్నేహమును వదులుకొందురు. కాని సజ్జనులు ఒకరినొకరు పరస్పర మవగాహన జేసికొని చెలిమిని పెంచుకొందురు.

అవతారిక : మానవునికి తను చేసికొన్న పుణ్యమే తనకు రక్ష. కనుక జీవిత కాలమునందట్టి పుణ్యసంపాదన మెప్పుడు చేయవలయునో ఈ క్రింది శ్లోకము సూచించును.

యావత్స్వస్థమిదం శరీరమరుజం, యావచ్చదూరేజరా
యావచ్చేన్ద్రియ శక్తి రప్రతిహతా, యావత్ క్షయో నాయుషః।
ఆత్మశ్రేయసి తావదేవ విదుషాకార్యః ప్రయత్నోమహాన్
సందీప్తేభవనే తు కూప ఖననం ప్రత్యుద్యమః కీదృశః॥

(వైరాగ్య–శ్లో.75)

భావము : ఎంతకాలమీదేహము రోగములులేక దృఢముగ, బలిష్టముగ నుండునో, ఎంతవరకు ముదిమి రాక దూరముగ నుండునో, ఎంతదనుక నింద్రియ ముల పటుత్వము సడలకుండునో, ఎంతకాల మాయువు క్షీణింపక యుండునో, అంతకు ముందుగనే జ్ఞానవంతుడగు మానవుడు తన శ్రేయస్సుకొరకు సత్కర్మాను ష్ఠానములద్వారా మంచి యత్నము చేసికొనవలెను.

అట్లుగాక రోగములు, ముదిమి, బలహీనత, ఆయుఃక్షయము మీదబడి శరీరము నశించుచున్న చివరిదశలో ఏ కార్యమునైనను సాధించదలచుట, యిల్లు కాలుచుండగ నూతిని త్రవ్వుటకు చేయు ప్రయత్నమువలె నిష్ప్రయోజనమని భావము.

లోకములో అనేకమంది నిత్యము పుట్టుచు, మరణించుచునే యున్నారు. అట్లయ్యు "సార్థకజన్ముడెవ్వడ"ను ప్రశ్నకు సమాధానము :

పరివర్తిని సంసారే మృతః కోవా న జాయతే।
సజాతో యేన జాతేన యాతి వంశస్సమున్నతిమ్॥

(ని.శ. శ్లో. 25)

నిత్యము పరిభ్రమించు ఈ ప్రపంచమందు పుట్టనివాడెవ్వడు ? చావని వా డెవ్వడు ? అట్లయ్యు ఎవనిచేత తనవంశము పేరుప్రఖ్యాతుల నొందునో అట్టివాడే పుట్టినవాడు.

అనగా పుణ్యపాపవశమున
చక్రమందు తగుల్కొని ప్రతి
ఎవరు తనవంశమునకు (దే
పుట్టుకయే పుట్టుక. కాగా మ
పరచుకొనవలెనని సందేశమ

లోకములో శూరులు, మానవంతులునగు వారు పూలగుత్తివంటి జీవనమార్గము గలవారని చెప్పుట :

కుసుమస్తబకస్యేవ ద్వయీవృత్తిర్మనస్వినః ।
మూర్ధ్ని వా సర్వలోకస్య, శీర్యతే వన ఏవవా ॥

(నీ.శ. శ్లో. 26)

ఆత్మాభిమానము, పౌరుషము గల్గినవ్యక్తికిగల మార్గములు రెండే రెండు. పూవుగుత్తివలె జనులయొక్క శిరోభాగము నలంకరించుట లేదా వనమందు జీర్ణించి నశించుట.

మాన శౌర్యములుగలవ్యక్తి తన శక్తిసామర్థ్యములచే సమాజమున అత్యున్నత స్థానమునొంది జీవించును. అట్టి అవకాశము లేనిచో అడవులందు కాయకసరులతో పొట్ట నింపుకొనునేకాని, నీచుల నాశ్రయించి ఏదోవిధముగ పొట్టను పోషించుకొను. నీచస్థితికి దిగజారడని భావము.

అవతారిక : లోకములో పౌరుషశాలురకు, కార్యసాధనమున వయస్సుతో సంబంధము లేదను విషయ మీ క్రిందిశ్లోకమున చెప్పబడినది :

సింహః శిశురపి నిపతతి మదమలిన కపోల భిత్తిషు గజేషు ।
ప్రకృతి రియం సత్త్వవతాం, న ఖలు వయః తేజసాం హేతుః ॥

(నీ.శ. శ్లో. 31)

తాత్పర్యము : సింహము శైశవమందున్నను మదము కారు కపోలములు గల ఏనుగుల కుంభస్థలములను జీల్చుటకు వానిపైకి దుముకును. ఇది శక్తిశాలురకు సహజస్వభావము. వారికి వయస్సుతో నిమిత్తము లేదు.

అవతారిక : లోకమున జనులు నీచులు, మధ్యములు, ఉత్తములని మూడు విధములుగ నుందురు. ఏదేని కార్యమును సాధించుటయందు వారివారి స్వభావము ఈ క్రింది శ్లోకమున చెప్పబడినది :

ప్రారభ్యతే న ఖలు విఘ్నభయేన నీచైః
ప్రారభ్య విఘ్ననిహతా విరమన్తి మధ్యాః ।
విఘ్నైర్ముహుర్ముహు రపి ప్రతిహన్య మానాః
ప్రారబ్ధ ముత్తమ జనా న పరిత్యజన్తి ॥

(నీ.శ. శ్లో. 73)

తాత్పర్యము : నీచులైన జనులు మధ్యలో విఘ్నము కల్గునను భయముతో ఎట్టి కార్యమును ప్రారంభించరు. మధ్యములైన జనులు ఉత్సాహముతో గొప్ప

కార్యములను ప్రారంభించినను, మధ్యమధ్య అడుగడుగునకు కలుగు విఘ్నములకు తట్టుకొనలేక వానిని అసంపూర్ణముగ వదలివేయుదురు. కాని యుత్తములైన జనులు మాత్రము ఎన్ని విఘ్నములు (ఆటంకములు) కలిగినను భయపడక, వానినెల్ల ధైర్యముగ నెదుర్కొనుచు ప్రారంభించిన పనిని విజయవంతముగ ముగింతురు.

లోకములో మహాత్ముల సహజ స్వభావమెట్లుండునో ఈ శ్లోకము విశదపరచును:

విపది ధైర్యమథాభ్యుదయే క్షమా
సదసి వాక్పటుతా యుధి విక్రమః ।
యశసి చాభి రతిర్వ్యసనం శ్రుతౌ
ప్రకృతి సిద్ధ మిదం హి మహాత్మనామ్ ॥

(నీ.శ. శ్లో. 53)

ఆపత్కాలమందు మనోధైర్యము కల్గియుండుట, సంపద గల్గినపుడు ఓర్పు వహించుట, సభలందు చక్కని నేర్పుతో మాట్లాడుట, యుద్ధమందు పరాక్రమము జూపుట, కీర్తి నార్జింపవలెననెడు దీక్ష, వేదశాస్త్రముల నభ్యసించుట యందాసక్తి - అనెడి యీ గుణములన్నియు మహాత్ములైనవారికి సహజసిద్ధములు.

"దుర్జనుడు సజ్జనులను బాధించుటకు కారణమక్కరలేదను" విషయము సోదాహరణముగ చెప్పబడుచున్నది:

మృగ మీన సజ్జనానాం తృణజల సన్తోష విహిత వృత్తీనాం
లుబ్ధక ధీవర పిశునా నిష్కారణమేవ వైరిణో జగతి ॥

(నీ.శ. శ్లో. 51)

లోకములో నితరుల నెవ్వరిని పీడింపక, గడ్డితోనే జింకలును, నీళ్లతో చేపలును, సంతృప్తితో సజ్జనులును వారివారి కాలమును గడుపుకొనుచుందురు. అట్లయినను మృగములకు వేటగాండ్రును, చేపలకు జాలరివాండ్రును, సజ్జనులకు దుర్మార్గులగు నీచులును కారణములేకయే విరోధులగుచున్నారు. అనగా దుర్మార్గులు వారి స్వార్థముకొరకెట్టివారికైన ఎట్టికీడునైనను చేయుదురని భావము.

అవతారిక: విద్య మానవున కెట్టిలాభమును చేకూర్చునో ఈ క్రింది శ్లోకమున వర్ణించబడినది:

విద్యా నామ నరస్య రూపమధికం, ప్రచ్ఛన్న గుప్తం ధనం
విద్యా భోగకరీ, యశస్సుఖకరీ విద్యా గురూణాం గురుః ।
విద్యా బన్ధుజనో విదేశగమనే, విద్యా పరాదేవతా,
విద్యా రాజసుపూజ్యతే న హి ధనం, విద్యావిహీనః పశుః ॥

(నీ.శ. శ్లో. 17)

భావము : విద్యయే పురుషునికి ఆభరణాదులు లేకున్నను ప్రకాశించు రూపము. ఇది ఇతరుల కగుపడక రహస్యముగ నుండు ధనము. ఈ విద్యయే సమస్త భోగములను, కీర్తిప్రతిష్ఠలను కల్గించును. విద్య గురువులకుగూడ గురువు వంటిదై హితాహిత బోధచేయును. దేశాంతరమునకు పోవునపుడది బంధువువలె మిక్కిలి యుపయోగించును. ఈ విద్యయే మానవునికి వలయు ముక్తినిగాని, ఐహికాముష్మిక సుఖములగాని యిచ్చు పరదేవత. అట్టి విద్యగలవారే రాజసభలందు సన్మానింపబడుదురు. విద్యకుగల యీ లక్షణములు ధనమునకు లేవు. కావున విద్యలేనివాడు కర్తవ్యాకర్తవ్య వివేక శూన్యుడగుటచే పశుప్రాయుడు.

అవతారిక : సాధారణముగ మానవుడు జీవితముపట్ల నిరాశానిస్పృహలకు తావీయరాదని సోదాహరణముగ చూపబడినది :

ఛిన్నోపి రోహతి తరుః క్షీణో ప్యుపచీయతే పునశ్చన్ద్రః
ఇతి విమృశన్త స్సన్తః సన్తప్యన్తే న విప్లుతా లోకే ॥

(నీ.శ. శ్లో. 80)

చెట్టును నరికినను మరల అది చిగుర్చును. చంద్రుడు కృష్ణపక్షమందు క్షీణించియు మరల వృద్ధిపొందును. ఈ విధముగ విమర్శించుకొనుచు సజ్జనులు లోకమందు దుఃఖించరు.

అనగా పై రెండు దృష్టాంతములను గుర్తించినవారై శీలవంతులు, వివేకవంతులైన మానవులు తమకేదేని యాపదలు కల్గినను, తాముగూడ ఆ వృక్షచంద్రుల వలె మరల సుఖమును, అభివృద్ధిని పొందగలమని గుర్తించి, దుఃఖించక ఆత్మనిగ్రహముతో వ్యవహరింతురు.

లోకములో ఎట్టి ప్రవర్తనగల్గిన వ్యక్తి తాను సుఖపడుచు లోకమును సుఖింపచేయునో ఈ క్రింది శ్లోకమున చెప్పబడినది :

దాక్షిణ్యం స్వజనే దయా పరిజనే శాఠ్యం సదా దుర్జనే,
ప్రీతిస్సాధుజనే నయోనృపజనే, విద్వజ్జనే చార్జవమ్ ।
శౌర్యం శత్రుజనే క్షమా గురుజనే కాన్తాజనే ధృష్టతా
యేచైవం పురుషాః కలాసు కుశలాస్తే ష్వేవలోక స్థితిః ॥

(నీ.శ. శ్లో. 19)

బంధుజనులయెడ దాక్షిణ్యము, భృత్యులయెడ దయగల్గియుండుట, దుర్జనులపట్ల కఠినముగ వ్యవహరించుట, సజ్జనులతో స్నేహము నెఱపుట, రాజుల (అధికారుల) పట్ల వినయముగ ప్రవర్తించుట, విద్వాంసులపట్ల ఋజుప్రవర్తనము కల్గియుండుట, శత్రువులపట్ల పరాక్రమము చూపుట, గురుజనులపట్ల ఓర్పు

జూపుట, స్త్రీల విషయమున దిట్టతనము గల్గియుండుట – అను నీ గుణములందు నేర్పరులైనవారివలననే యీ లోకస్థితి చక్కగ నున్నది.

మూర్ఖుని రంజింపచేయుట మిక్కలి కష్టమని ఈ క్రింది శ్లోకము విశదీకరించును :

అజ్ఞ స్సుఖ మారాధ్య స్సుఖతర మారాధ్యతే విశేషజ్ఞః ।
జ్ఞాన లవ దుర్విదగ్ధం బ్రహ్మాపి నరం నరంజయతి ॥

(నీ.శ. శ్లో. 3)

కొంచెమైనను తెలియనివానికి సుఖముగ తెలియజెప్పవచ్చును. విషయము తెలిసినవానికి ఇంకను సుఖముగ బోధించవచ్చును. అంతియకాని, తెలిసియు తెలియని నరునకు తెలియపరుచుట ఆ బ్రహ్మకుగూడ శక్యము గాదు.

అనగా లోకములో అల్పజ్ఞానము గల్గి, తన్ను మహాపండితునిగ, సర్వజ్ఞునిగ భావించుకొను వ్యక్తి మూర్ఖు డనబడును. అతడు ఇతరులు చెప్పినదానిని వినడు. తనకు స్వయముగ తెలిసుకొనుశక్తి యుండదు. ఇటువంటి వ్యక్తులను బాగు చేయుట మానవులకు సాధ్యపడదు.

భర్తృహరి ఈ శ్లోకమందు మానవంతులకు, నీచులకు గల స్వభావ భేదమును సోదాహరణముగ చూపెను :

యథా కందుక పాతేనో త్పతత్యార్యః పతన్నపి ।
తథా త్వనార్యః పతతి మృత్పిండ పతనం యథా ॥

(నీ.శ. శ్లో. 84)

బంతి మీదనుంచి క్రిందకు పడి మరల మీది కెగురునట్లు సుజనుడు ఆపద నొందినను మరల ఉన్నతి నొందును. మందుడుమాత్ర మట్లుగాక, మట్టిముద్దవలె పడినచోటనే కదలక యుండును.

అనగా శక్తిసామర్థ్యములు గల్గిన సజ్జనుడు, ఏదేని కర్మవశముచే హీనస్థితిని బొందినను, దుఃఖించుచు అచటనే గూర్చొనడు. మరల ఉన్నతస్థితిని యత్నించి సాధించును. మట్టిముద్దలో పైకెగురు శక్తిలేకపోవుటచే పడినచోటనే యుండిపోవును. అట్లే శక్తిసామర్థ్యములు లేని మందబుద్ధి ఒకసారి హీనస్థితిని బొందెనా యిక పైకి రాలేడని భావము.

ఈ శ్లోకము మానవుడేలపుణ్యము నార్జించవలెనో—చెప్పును :

వనే రణే శత్రుజలాగ్నిమధ్యే మహార్ణవే పర్వత మస్తకే వా ।
సుప్తం ప్రమత్తం విషమస్థితం వా రక్షన్తి పుణ్యాని పురాకృతాని ॥

(నీ.శ. శ్లో. 100)

ఏ వ్యక్తి పూర్వమునందు పుణ్యకార్యముల నాచరించి పుణ్యమును సంపాదించునో యట్టి వ్యక్తి అడవియందు, యుద్ధమునందు, శత్రు మధ్యమందు, నీళ్లు, నిప్పు మొదలగు ప్రాణాపాయ పరిస్థితులందును జిక్కుకొన్నను, మహాసముద్రమునందుపడినను, కొండశిఖరమున నిద్రించుచున్నను, ఒడిదుడుకులచే నచటనుండి జారిపడినను, వానికెట్టి యాపదలు కలుగకుండ వాని నాతని పుణ్యములే రక్షించును. కావున మానవుడు సర్వకాల సర్వావస్థలందు పుణ్యము నార్జించవలెను.

ఈ ప్రపంచమునందు 'స్థిరమైనదేది? అస్థిరమైనదేది?' అను ప్రశ్నకు సమాధానమును ఈ క్రింది శ్లోకము చెప్పును :

చలా లక్ష్మీః చలాః ప్రాణాశ్చలం జీవిత యౌవనం।
చలాచలే చ సంసారే ధర్మ ఏకోహి నిశ్చలః ॥

(వై.శ. శ్లో. 116)

ఈ ప్రపంచమున సంపదలన్నియును అశాశ్వతములు. ప్రాణముల కసలే స్థిరత్వము లేదు. యౌవనముగూడ అస్థిరమే. అట్లు సమస్తమును అశాశ్వతమగు ఈ ప్రపంచమందు శాశ్వతమైనది ధర్మ మొక్కటియే. కనుక ప్రతిమానవుడును శాశ్వతమైన ధర్మసంపాదనమునకై సత్కార్యముల నాచరించవలెనని భావము.

మిక్కిలి అశాంతి నిలయమగు ఈ లోకమున శాంతిసుఖములను బొందువారిని వర్ణించుట :

అకిఞ్చనస్య దాన్తస్య శాన్తస్య సమచేతసః।
సదా సన్తుష్టమనసః సర్వాస్సుఖమయాదిశః ॥

(వై.శ. శ్లో. 111)

ఏమియు లేనివాడును, బాహ్యేంద్రియముల నరికట్టినవాడును, అంతఃకరణమును నిగ్రహించునవాడును, సమభావముగల మనస్సుగలవాడును, ఎల్లపుడు సంతుష్టిచెందిన మనస్సుగలవాడును—అగు మనుష్యునికి దిక్కులన్నియు సుఖమయములై యుండును.

అనగా ఏ వ్యక్తి ఉన్నదానితో తృప్తిపడుచు, పేరాసల నుంచుకొనక ఇతరులను ద్వేషించక, అందరియందు సమభావముతో ప్రవర్తించునో అట్టివాని, లోకమంతయు సుఖకరముగనే యుండునని భావము.

దుర్జనుల స్వభావ మెట్లుండునో ఈ క్రింది శ్లోకమున జెప్పబడినది :

అకరుణత్వ మకారణ విగ్రహః।
పరధనే పరయోషితి చస్పృహా।

సుజన బన్ధుజనేష్వసహిష్ణుతా
ప్రకృతి సిద్ధమిదం హి దురాత్మనామ్ ॥

(నీ.శ. శ్లో. 42)

ఇతరులపట్ల జాలి చూపకుండుట, ఇతరులతో కారణములేకయే కలహించుట, పరుల ధనము నపహరించుట, పరస్త్రీల పొందుకోరుట, సజ్జనులయెడ, బంధువుల యెడ అసూయ కల్గియుండుట అనునవి దుర్జనునికి సహజ లక్షణములు.

రాజనీతి చాల కుటిలమైనదని చెప్పుచు దాని స్వరూపమును వర్ణించుచున్నారు :

సత్యానృతాచ పరుషా ప్రియభాషిణీ చ
హింస్రా దయాళు రపి చార్థపరా వదాన్యా ।
నిత్యవ్యయా ప్రచుర నిత్యధనాగమా చ
వారాఙ్గనేవ నృపనీతి రనేకరూపా ॥

(నీ.శ. శ్లో. 39)

రాజనీతి కొన్ని విషయములందు సత్యముగ, న్యాయముగ నుండును. కొన్ని సమయములందు అసత్యముగ నుండును. అట్లే కొన్నిట కఠినముగ, మరికొన్ని చోట్ల దయతోకూడినదిగ ఉండును. కొన్ని విషయములందు ధనలోభమును చూపుచు మరికొందరిపట్ల అధికముగ దానముచేయుటయు నుండును. ఒకవైపు మిక్కిలిగ ధనమును వ్యయపరచుచు, మరికొన్ని మార్గములద్వారా నిత్యధనసంపాదనమందే మునిగియుండును. ఈ విధముగ రాజనీతి వేశ్యాప్రవృత్తివలె మిక్కిలి గహనమై సామాన్యులకు బోధపడకయుండును.

ఈ క్రింది శ్లోకములో మానవుడు తప్పించుకొనుటకు వీలులేని ఆపదలు చూప బడినవి :

వ్యాఘ్రీవ తిష్ఠతిజరా పరితర్జయన్తీ
రోగాశ్చ శత్రవ ఇవప్రహరన్తి దేహమ్ ।
ఆయుః పరిస్రవతి భిన్నఘటాదివాంబో
లోకస్తథాప్యహితమాచరతీతి చిత్రమ్ ॥

(వై.శ. శ్లో. 38)

ప్రతివ్యక్తికిని ముసలితనము గాండ్రించుచున్న ఆడపులివలె మీదపడుటకు కాచుకొనియున్నది. రోగములు శత్రువులవలె దేహమును బాధించుచున్నవి. ఆయువు గూడ చిల్లికుండలోని నీరువలె అనుక్షణము నశించుచున్నది. ఐనను జనులుమాత్రము ఇతరులకు బాధను కల్గించునట్టి లేదా తమకు హానికరములగు కార్యములనుచేయుట ఎంతయు విచిత్రముగ నున్నది.

ఈ క్రింది శ్లోకములో లోకముయొక్క విచిత్రస్వభావము వర్ణింపబడినది :

క్వచిద్వీణానాదః క్వచిదపిచ హాహేతి రుదితం,
క్వచి ద్విద్వద్గోష్ఠీ క్వచిదపి సురామత్త కలహః ।
క్వచి ద్రామా రమ్యా క్వచిదపి గళత్కుష్ఠ వపుషో
న జానే సంసారః కి మమృతమయః కిం విషమయః ॥

(వై.శ. శ్లో. 115)

ఈ ప్రపంచమందొకచోట మధురమంజుల వీణానాదములు, మరియొకప్రక్క హా, హా యను దారుణ రోదనాక్రందనలు. ఒకవంక మహాజ్ఞాన నిధులగు శాస్త్రజ్ఞుల పండితగోష్ఠులు. మరియొకవంక కల్లుత్రాగి పరస్పరము పోట్లాడుకొను నీచుల మూకలు. ఒకవంక అప్సరసలబోలు అందమగు స్త్రీలు. మరియొకప్రక్క కుష్ఠు మొదలగు వ్యాధులతో జుగుప్సాకరమైన దేహములు. ఇట్లు పరస్పర విరుద్ధస్వభావములతో గూడిన యీ లోకము సుఖమయమో, దుఃఖమయమో తెలియకున్నది.

శృంగార శతకమునందు సాధారణపురుషులు స్త్రీలయందెంతటి గాఢ బంధమును కలిగియుందురో చమత్కారముగ చెప్పిన ఘట్టము లనేకములు గలవు. అందొకటి :

మాత్సర్య ముత్సార్య విచార్య కార్య
మార్యాః సమర్యాద మిదం వదన్తు ।
సేవ్యా నితమ్బాః కిము భూధరాణా
ముత స్మరస్మేర విలాసినీనామ్ ॥

(శృం.శ. శ్లో. 36)

ఓ పండితులారా! మీరు మాత్సర్యమును (పక్షపాతబుద్ధిని) విడచి, చక్కగ విచారించి సత్యమును చెప్పుడు. మాచే సేవింపదగు స్థలములు కొండచరియలా, లేక మన్మథవిలాసములతో హెచ్చయలుచిమ్ము మదవతుల నితమ్బ (కటి) ప్రదేశములా!

అనగా స్త్రీలను సేవించుటకంటె కొండగుహలందు తపస్సుచేయుట ఉత్తమ మని కొందరు అనుచున్నారు. మరికొందరు స్త్రీ లేనిదే జీవితమున సుఖము లేదనుచున్నారు. కనుక మే మెవ్వరి సేవింపవలెనని సామాన్యుని సందేహము.

పై సందేహమునకు సమాధానమోయనునట్లు ఈ క్రింది శ్లోకము విలసిల్లును :

సత్యం జనా వచ్మి న పక్షపాతా ల్లోకేషు సప్తస్వపి తథ్యమేతత్ ।
నాన్యన్మనోహారి నితమ్బినీభ్యో, దుఃఖైక హేతుర్నచ కశ్చిదన్యః ॥
(శృం.శ. శ్లో. 40)

జనులారా! నేను అన్ని లోకములందును అన్వయించు సత్యమును చెప్పి దను. అట్లు చెప్పుటలో పక్షపాతబుద్ధి లేదు. స్త్రీలకంటె మనోహరమైనది వేఱొద్దియును లేదు. అట్లే సమస్త దుఃఖములకుగూడ ఆ స్త్రీయే కారణమగుచున్నది.

అనగా లోకమున మానవుల సుఖదుఃఖములకు స్త్రీయే మూలకారణమని భావము.

# జయదేవుడు-నారాయణతీర్థులు సదాశివబ్రహ్మేంద్రయతి-లీలాశుకుడు

డా॥ తెన్నేటి సత్యగౌరీపతిశాస్త్రి

జయదేవుడు :

రసరాజపులకితమై లలితలలితపదకలితమైన రాధామాధవుల వసంతకేళీవిలాస మరంద పూర్ణమైన గీతగోవిందకమలిని సంస్కృతవాఙ్మయ మానససరోవరంలో వికసించిన మనోహర మధురోహ. గీతగోవిందం జయదేవాధర పరిస్పంద జనిత నాదసుధారసభరితారవిందం !

భాగవతంలో ఉన్న ద్వాదశకాండలూ ఆర్షసంస్కృతి ప్రతీకమైన గాయత్రిలో గల ఇరవైనాలుగు అక్షరాలూ ఇందులో స్థూలంగా పన్నెండు సర్గలగానూ ఇరవైనాలుగు అష్టపదులుగానూ దర్శనమిస్తాయి. ఓఢ్రదేశంలో (ముఖ్యంగా) ఈ కావ్యం అతి ప్రసిద్ధిని పొందింది. ఆంధ్రరాజైన ప్రతాపరుద్రుడు దీనిని దేవాలయాల్లో గానం చేయాలని ఆదేశించాడు.

జయదేవుడు భోజదేవ వామదేవీ పుత్రరత్నం. బీర్‌భూమ్ (బెంగాల్) లో ప్రవహించే అజయానదీతీరాల విరాజిల్లిన కిందుబిల్వ (కేందులీ) గ్రామసీమలీ అమర కవికంఠమాధుర్య పరిమళంలో పులకితమయ్యాయి. లక్ష్మణవతిని రాజధానిగా చేసికొని వంగదేశాన్ని (క్రి.శ. 1116) పాలించిన వైద్య (వంశ) లక్ష్మణసేనరాజభూజాన్ని ఆలంబనంగా అల్లుకొని జయదేవ కవితాలత జగన్మోహనంగా వ్యాపించి దశదిక్కులా తన గీత సౌరభాన్ని వెలార్చింది. జర్మన్, (రికర్ట్ – లీప్‌త్సిహ్‌ఖ్) ఫ్రెంచి (కూర్తెలిర్ – పేరిన్), ఇంగ్లీష్ (సర్ ఎడ్విన్ ఆర్నాల్డ్) వాఙ్మయసుమనోవనాలు కూడా జయదేవాష్టపదీ పాదరజః పరిపూతాలయ్యాయి. పుష్యశుక్లసప్తమిని జయదేవ – పుణ్యతిథిగా భావిస్తారు.

రామకరీరాగః - యతితాలః

చందన చర్చిత నీలకలేవర పీతవసనవనమాలీ
కేలిచలన్మణికుండలమండిత గండయుగస్మితశాలీ ॥

హరిరిహ ముగ్ధవధూనికరే విలాసిని విలసతి కేలిపరే ।
కాపి విలాసవిలోలవిలోచన ఖేలనజనితమనోజమ్ ।
ధ్యాయతి ముగ్ధవధూరధికం మధుసూదనవదనసరోజమ్ ॥
శ్లిష్యతి కామపి చుంబతి కామపి రమయతి కామపి రామామ్ ।
పశ్యతి సస్మిత చారుతరామపరామనుగచ్ఛతి వామామ్ ॥
శ్రీ జయదేవకవేరిదమద్భుత కేశవకేలిరహస్యమ్ ।
బృందావనవిపినే లలితం వితనోతు శుభాని యశస్యమ్ ॥

ఓ విలాసినీ! చందనచర్చితమైన వినీలతనువుపై విలసిల్లే పసిడిరంగు వసనం ధరించి రాసకేళిలో నర్తించే మణికుండల శోభితుడై కపోలయుగంమీద మందస్మిత కలితుడైన హరి రాసకేళిలో నిమగ్నమయిన ముగ్ధగోపవధూసమూహంలో విలసిస్తున్నాడు.

ఒక గోప ముగ్ధ విలాసంగా చూపుల నాట్యంలో తనలో మన్మథవికారం జనింపచేసిన మధుసూదన వదనసరోజాన్ని మనసులోనే ధ్యానిస్తోంది.

తానొకడైనా గోపకామినుల కనేకరూపుడైన మాధవుడు ఒక విలాసినిని కౌగలిస్తున్నాడు. మరొక గోపకాంతని చుంబిస్తున్నాడు. వేరొక మనోహరితో రమిస్తున్నాడు. చిరునవ్వుతో మనసుదోచే మరొక కామినిని తిలకిస్తున్నాడు. (చిలిపిగా, తనను కవ్వించిన) వేరొక మనోహరిని వెంటాడుతున్నాడు.

శ్రీ జయదేవకవిరచితమైన లలితమైన అద్భుతమైన కీర్తివంతమైన బృందావన విపినాలలో విలసిల్లిన ఈ కేశవకేళీరహస్యం మీకు శుభాల్ని కలిగించుగాక.

## నారాయణ తీర్థులు :

శివరామానందతీర్థ శిష్యుడైన నారాయణ తీర్థుడు రచించిన శ్రీకృష్ణ లీలా తరంగిణి ఒక అపూర్వ సంగీత భక్తిరస తరంగిణి. నారాయణతీర్థుడు గోదావరీ తీరంలో ఉన్న కూచిమంచి అగ్రహారవాస్తవ్యుడు. ఈయన క్రీ.శ. 1700 కాలంనాటి వాడని చారిత్రకభావన. శ్రీ కృష్ణుడి లీలలే మనోహర గీత శిల్పాలుగా ఈకావ్యంలో మనకు గోచరిస్తాయి. దీనిలో ప్రతి తరంగానికీ రాగతాళాలు నిర్దిష్టంగా (కవి స్వయంగా?) కూర్చి తరంగ తరంగానికి మధ్య కథాగమనసోపానాలుగా శ్లోకాలు వాక్యాలూ రచించాడు. ఈ గీతకావ్యం లలిత మనోహర సంస్కృత భాషాపరిమళితం. అఖిలాంధ్ర దేశంలోనూ అతిప్రసిద్ధం. ప్రకృత తరంగంలో భూదేవి తనను కుంగదీస్తున్న దుర్భర పాపభారాన్ని తొలగించమని విష్ణుమూర్తిని ప్రార్థించడం ఇతివృత్తం.

## సౌరాష్ట్రరాగః - ఆదితాలః

శరణం భవ కరుణాం మయి కురు దీనదయాలో
కరుణారస వరుణాలయ కరిరాజకృపాలో
అధునా ఖలు విధినా మయి సుధియాసురభరితమ్ ।
మధుసూదన మధుసూదన హర మామకదురితమ్ ॥
వరనూపురధర సుందరకరశోభితవలయ
సురభూసుర భయవారక ధరణీధర కృపయా
త్వరయా హర భరమీశ్వర సురవర్య మదీయమ్ ॥మధు॥
ఘృణిమండల మణికుండల ఫణిమండలశయన ।
అణిమాదిసుగుణభూషణ మణిమంటపసదన
వినతాసుతఘనవాహన మునిమానసభవన ॥మధు॥
అరిభీకర హలిసోదర పరిపూర్ణసుఖాబ్ధే
నరకాంతక నరపాలక పరిపాలితజలధే
హరిసేవకశివనారాయణతీర్థపరాత్మన్ ॥మధు॥

దీనదయాళూ! కరిరాజకృపాళూ! కరుణసాగరా! శరణు!! నాయందు కరుణ వహించు.

ఓ మధుసూదనా! మధుసూదనా! రాక్షసులు నాకు కలిగిస్తున్న ఈ పాపాన్ని వెంటనే నిపుణంగా హరించు.

చక్కని నూపురాలు ధరించి అందమైనహస్తాభరణాలతో శోభిస్తూ సురుల భూసురుల భయం పోగొట్టి (అలనాడు నన్ను) ధరణిని దయతో ఉద్ధరించిన సుర వర్యా! నా (పాప) భారాన్ని త్వరగా హరించు ఈశ్వరా! ॥

సూర్యచంద్రమండలాలు కుండలాలుగా ధరించిన దేవా!

ఫణి (ఆదిశేషుడి) మండలంపై శయనించే ప్రభూ! అణిమాది యోగసిద్ధుల్నే ఆభరణాలుగా ధరించి మణిమండపంలో నివసించేదేవా! గరుడవాహనా!

మునిమానససంచారీ! నా పాపాన్ని హరించు ॥

శత్రుభయంకరా! బలరామసోదరా! పూర్ణసుఖసాగరా! నరకాసుర నాశకా! నరపాలకా! సాగరపాలకా! (హరిసేవకుడైన శివనారాయణతీర్థ రక్షకా) మధుసూదనా! నా పాప భారాన్ని హరించు॥

## సదాశివబ్రహ్మేంద్రయతి :

క్రీ.శ. 17వ శతాబ్దికి చెందిన సదాశివబ్రహ్మేంద్ర సరస్వతి యాభై ఏడవ కాంచీ కామకోటి పీఠాధిపతి అయిన పరమశివేంద్రసరస్వతి శిష్యుడు. సదాశివుడి

జనకుడు సహాజీ రాజపురాన్నేలిన మహారాష్ట్ర రాజైన సహాజీ (క్రీ.శ. 1684-1711) రాజ పోషితుడు. సదాశివుడి బుద్ధివైభవం బహుముఖీనం. అప్పయ్య దీక్షితుడి సిద్ధాంతలేశ సంగ్రహాన్ని శ్లోకరూపంగా వెలయించి దానికి కేసరవల్లి అనే సులభటీకని రచించాడు. పతంజలి యోగసూత్రాలపై ఇతను రాసిన యోగసుధాకరం చాలా విశిష్టమైన వ్యాఖ్య. వాదిభయంకరుడైనా లలితవాగ్గేయకారుడు. లలితంగా అనుభవ వేదాంత పరిమళ భరితంగా అద్వైత రహస్యాల్ని చిరుపాటలుగా మృదువుగా వీనులకింపైన జిలిబిలి పలుకుల రమణీయతతో రంగరించి భక్తలోకానికందించిన సదాశివబ్రహ్మేంద్రుణ్ణి గూర్చిన మహిమలనేకం అద్భుతగాథలుగా చరిత్రలో మిగిలిపోయాయి.

స్థిరతా నహి నహి రే మానస ! స్థిరతా నహి నహి రే ।
తాపత్రయ సాగరమగ్నానాం దర్పాహంకార విలగ్నానామ్ ॥స్థిరతా॥
విషయపాశవేష్టిత చిత్తానాం విపరీతజ్ఞానవిమత్తానామ్ ॥స్థిరతా॥
పరమహంస యోగ విరుద్ధానాం బహుచంచలతరసుఖసిద్ధానామ్ ॥స్థిరతా॥

ఒరే ! మనసా ! స్థిరత్వం లేదురా ! (మానసస్థిరతలేదురా !!) తాపత్రయాలలో మునిగినవారికి దర్పాహంకారలలో మునిగినవారికి ॥స్థిర॥ విషయపాశావృత మానసులికీ విపరీత వక్రజ్ఞానమత్తులకీ ॥స్థిరత॥ పరమహంసయోగానికి విరుద్ధంగా జీవించేవారికి, బహుచంచలమైన సుఖాలకి లొంగిపోయినవారికీ ॥స్థిరత॥

## లీలాశుకుడు :

నీలీదామోదరుల పుత్రుడూ ఈశానదాస శిష్యుడూ అయిన కృష్ణలీలాశుకుడు మలబారులో భారతీనదీ తీరాలలో విరాజిల్లిన ముక్తిస్థల (ముక్కుత్తలై) వాస్తవ్యుడు. ఇతడు క్రీ.శ. 11వ శతాబ్దికి చెందినవాడు. లీలాశుకకంఠ వినిస్సృతమైన శ్రీ కృష్ణ కర్ణామృతం మనోజ్ఞపదవిలసితం సప్తత్రయ బద్ధమైన ఈ కావ్యం శ్రీకృష్ణ లీలావర్ణన మిషతో వేదాంతాన్ని లలితంగా లోకానికందించిన భక్తిరసభరిత గేయకావ్యం.

అంగనామంగనామంతరే మాధవో
మాధవం మాధవం చాంతరేణాంగనా ।
ఇత్థమాకల్పితే మండలే మధ్యగః
సంజగౌ వేణునా దేవకీనందనః ॥
చారుచంద్రావళీ లోచనైశ్చుంబితో
గోపగోబృంద గోపాలికా వల్లభః ।

వల్లవీబృంద బృందారకః కాముకః
సంజగౌ వేణునా దేవకీ నందనః ॥

కృష్ణామృతం II. 38

గోపాంగనకీ గోపాంగనకీ మధ్య మాధవుడూ, మాధవుడికీ మాధవుడికీ మధ్య గోపాంగన – ఈ తీరులో ఏర్పడిన వలయంలో తాను మధ్య మణిగా భాసిస్తూ వేణువుతో వీనులకింపుగా దేవకీనందనుడు గానం చేస్తున్నాడు.

చక్కని చంద్రబింబమాలవంటి నయనావళిచే చుంబితుడై గోపాలురకీ గోబృందానికీ, గోపకామినులకీ ప్రియతముడైన గోపబృంద దేవుడైన (సకలజన) కాముకుడైన దేవకీనందనుడు వేణువుతో వీనులకింపుగా గానంచేస్తున్నాడు.

# సుభాషితాలు

## డా॥ తెన్నేటి సత్యగౌరీపతిశాస్త్రి

పాఠకులలో సంస్కృతిని వృద్ధిచేయడమే సాహిత్యం పరమలక్ష్యం. సర్వ సాహిత్యాలూ వాఙ్మయాలూ ఈ లక్ష్యాన్ని నెరవేర్చే రీతులు వేరువేరుగా ఉండ వచ్చు. ఈ రీతుల్లో సుభాషిత సృజన విశిష్టమైనది. మనుష్యుల దైనందిన జీవనం లోనూ మనీషుల జీవితాలలోనూ మనీభవించిన అనుభవ స్ఫటికాలే ఈ సుభాషితాలు.

సుభాషితాల్ని విశదీకరించి ఛందోబద్ధంగా లయపూర్వకంగా బహుజనగ్రహణ యోగ్యంగా వెలయించే ప్రయత్నాలు శతకవాఙ్మయ సృజనకి నాందీవాక్యం పలి కాయి. తెలుగులో సుమతి శతకం, వేమనశతకం శతక వాఙ్మయమాలలో ముఖ్య మణులు.

అన్వర్థమైన సంస్కృత వాఙ్మయంలో సుభాషితాలు మహాకవుల సువర్ణ రచ నలలో ఆయా సందర్భాలలో పొదిగిన మాణిక్యాలలా తళుక్కుమంటాయి. ఏ వాఙ్మయంలోనైనా మహాకవుల సంఖ్య ఏనాడూ ఒక హస్తాన్ని మించదు. తత్రాపి ప్రత్యేక సందర్భాలలో మాత్రమే ఔచిత్య పురస్సరంగా సుభాషితాలు మహా రచనలలో పరిమళిస్తాయి. అయితే సంస్కృత వాఙ్మయంలో త్రికాలాబాధ్యంగా చిరంతన భావసంపదని చిరుమాటలలో చెప్పే ఈ సుభాషితాల సంఖ్య అపరిమితంగా ఎలా పెరిగింది అని శంక కలగవచ్చు.

సంస్కృత వాఙ్మయస్రష్టలు అందరూ వెలుగులోకి రాలేదు అనేది సామాన్య సమాధానం. కాని కేవలం సుభాషితాలు మాత్రమే సృజించి నిస్స్వార్థంగా నిర్నామ కంగా తాము కాలయవనిక వెనక ఉండిపోతూ లోకానికి తరతరాలుగా భావసౌశీల్య సంస్కృతి – సంపదని సుభాషిత శిల్పాలుగా చెక్కి చరిత్ర ప్రవాహంలో లీనమై పోయినవారెందరో మహానుభావులు. మృగం తరలిపోయినా పసిడిగిన్నెలో దాచిన మృగమద పరిమళం దశ దిగ్వ్యాప్యమవుతుంది. సహృదయులు కొందరు ఈ సుభా షితాల్ని కాలకఠోర గర్భంలో కలిసిపోకుండా పుస్తక భాండాగారాలలో దాచి రక్షించారు.

ఆ అమేయ వాఙ్మణిమాలలో కొన్ని రేకల్ని చిరుదండగా ఇక్కడ సమర్పిస్తు న్నాను :

1. సుభాషితేన గీతేన యువతీనాం చ లీలయా ।
మనో న భిద్యతే యస్య స యోగీ హ్యథవా పశుః ॥

సుభాషితాలకీ (సం) గీతానికీ యువతుల సౌందర్యానికీ మనసు కరగనివాడు యోగీ, కాకపోతే పశువూ అయివుండాలి.

2. సంసారవిషవృక్షస్య ద్వే ఫలే హ్యమృతోపమే ।
సుభాషితరసాస్వాదః సంగతిః సుజనే జనే ॥

సంసార విషవృక్షానికి అమృతంవంటి (రుచిగల) పళ్లు రెండే ! (అవి) సుభాషితరసాస్వాదం, సత్సాంగత్యం.

3. పృథివ్యాం త్రీణి రత్నాని జలమన్నం సుభాషితమ్ ।
మూఢైః పాషాణఖండేషు రత్నసంజ్ఞా విధీయతే ॥

(నిజంగా) లోకంలో నీరూ, అన్నం, సుభాషితం అనే ఈ మూడే రత్నాలు. (ఇది తెలుసుకోలేక) మూఢులు రాతిముక్కలకి మణులని పేరు పెట్టేరు.

4. అపూర్వః కోఽపి కోశోఽయం విద్యతే తవ భారతి ।
వ్యయతో వృద్ధిమాయాతి క్షయమాయాతి సంచయాత్ ॥

ఓ సరస్వతీ ! నీ (విద్యారూపమైన) ఖజానా చాలా అపూర్వమైనది సుమా ! అది ఎంతగా (శిష్యులకి బోధించడంద్వారా) వ్యయం చేస్తే అంత వృద్ధి పొందుతుంది. (మాత్సర్యలోభాలలో ఇతరులకి వ్యాపింపచేయక) దాచినకొద్దీ తరిగిపోతుంది.

5. విద్వానేవ విజానాతి విద్వజ్జనపరిశ్రమమ్ ।
నహి వంధ్యా విజానాతి గుర్వీం ప్రసవవేదనామ్ ॥

విద్వాంసుడి (విద్యాగ్రహణంలో చేసిన) పరిశ్రమని మరొక విద్వాంసుడే గ్రహించగలడు. (అన్యులకది అర్థమవదు). వంధ్యస్త్రీలు కఠోరమైన ప్రసవవేదనని తెలుసుకోలేరుకదా !

6. శ్లోకార్థాస్వాదకాలే తు శబ్దోత్పత్తివిచింతకాః ।
నీవీమోక్షణవేలాయాం వస్త్రమూల్యవిచింతకాః ॥

చక్కని శ్లోకంయొక్క రమణీయార్థాస్వాదన సమయంలో (ఈ శబ్దం ఏ ధాతువునుండి ఏ ప్రత్యయంచేత ఏ సూత్రంవల్ల ఎలా వ్యుత్పన్నమైనదీ ? అనే) శబ్దోత్పత్తి చింతాగ్రస్తులు (స్త్రీల) నీవీమోక్షణసమయంలో చీర ఖరీదు ఎంతో తెలుసుకోవాలని ఉబలాట పడేవారి వంటివారు (నీవి = చీరముడి ; మోక్షణం = విప్పడం).

7. కర్ణామృతం సూక్తిరసం విముచ్య దోషేషు యత్నః సుమహాన్ ఖలస్య।
అవేక్షతే కేలివనం ప్రవిష్టః క్రమేలకః కంటకజాలమేవ ॥

చెవులకి అమృతంవంటిది సూక్తిరసం. దానిని విడిచిపెట్టి దుర్మార్గుడికి మహా ప్రయాసపడి దోషాలు వెదకడమే ధ్యేయం. కేళివనం (విహారవనం) ప్రవేశించిన మరుక్షణం ఒంటె ముళ్లపొదలకోసమే తహతహ లాడిపోతుంది.

8. ఖలః సర్షపమాత్రాణి పరచ్ఛిద్రాణి పశ్యతి।
ఆత్మనో బిల్వమాత్రాణి పశ్యన్నపి నపశ్యతి ॥

దుర్మార్గుడు ఇతరుల దోషాలు ఆవగింజలంత (చిన్న)వైనా ఇట్టే కనిపెడతాడు. తన దోషాలుమాత్రం మారేడుకాయ లంతేసిఉన్నా చూసీచూడనట్టూరుకొంటాడు.

9. పరిశ్రమజ్ఞం జనమంతరేణ మౌనవ్రతం బిభ్రతి వాగ్మినో-పి।
వాచంయమాః సంతి వినా వసంతం పుంస్కోకిలాః పంచమ
చంచవూ-పి ॥

(తన విద్యా) పరిశ్రమని తెలుసుకోగలిగిన వ్యక్తి లేనప్పుడు (ఎంతటి) జ్ఞాని (అయినా) మౌనవ్రతమే అవలంబిస్తాడు. (మనోహరమైన) పంచమ స్వరం కూయ గల్గిన సామర్థ్యం ఉన్నా వసంతకాలం రానప్పుడు గండుకోయిలలు మూగనోము పడతాయి.

10. యస్య నాస్తి స్వయం ప్రజ్ఞా శాస్త్రం తస్య కరోతి కిమ్।
లోచనాభ్యాం విహీనస్య దర్పణః కిం కరిష్యతి ॥

స్వయంగా ప్రజ్ఞ లేనప్పుడు శాస్త్రం(లో ఎంత పరిశ్రమచేసినా) ఎలా ఉపకరించగలదు? కళ్లు లేనివాడికి అద్దం ఎలా ఉపయోగపడుతుంది?

11. యస్య నాస్తి వివేకస్తు కేవలం యో బహుశ్రుతః।
న స జానాతి శాస్త్రార్థాన్ దర్వీ పాకరసానివ ॥

వివేకం లేకుండా అదేపనిగా అనేక శాస్త్రాలు వల్లెవేసిన పండితుడు (మంచి) వంటకంలో రుచి గ్రహించని గరిటవంటివాడు.

12. ప్రజ్ఞా వివేకం లభతే భిన్నైరాగమదర్శనైః।
కియద్వా శక్యమున్నేతుం స్వతర్కమనుధావతః ॥

పరస్పరం భిన్నమైన శాస్త్రపరిచయంచేత (తను గడించిన) ప్రజ్ఞకి వివేకం అబ్బుతుంది. తన తర్కమే పట్టుకొని వేలాడేవాడు సత్యాన్వేషణయోచనలో ఎంతవరకూ వెళ్లగలడు?

13. యత్నేనానుమితోఽప్యర్థః కుశలైరనుమాతృభిః ।
అభియుక్తతరైరన్యైరన్యథైవోపపాద్యతే ॥

ఎంతో బాగా ఆలోచించగలిగిన తార్కికులు నిర్ధారణచేసిన విషయమైనా వారిని మించినవారు (అంతకంటే బాగా) మరోవిధంగా ప్రతిపాదించగలరు (గదా !).

14. నాఽగుణీ గుణినం వేత్తి గుణీ గుణిషు మత్సరీ ।
గుణీ చ గుణరాగీ చ విరలః సరలో జనః ॥

గుణరహితుడు గుణవంతుణ్ణి గ్రహించలేడు. గుణవంతుడు మరొక గుణవంతుడంటే అసూయపడతాడు. గుణవంతుడూ గుణగ్రాహీ అయిన సరళస్వభావు లరుదు (గా కనిపిస్తారు).

15. ఉపకారిషు యః సాధుః సాధుత్వే తస్య కో గుణః
అపకారిషు యః సాధుః స సాధుః సద్భి రుచ్యతే ॥

(తనకి) ఉపకారంచేసినవాడి విషయంలో సౌహార్దం నెరపడంలో విశేషమేముంది ? (తనకి) అపకారంచేసినవాడి విషయంలోకూడా సౌహార్దం కనపర్చినవాణ్ణి సజ్జనుడని సజ్జనులంటారు.

16. దోషానపి గుణీకర్తుం దోషీకర్తుం గుణానపి ।
శక్తో వాదీ న తత్తథ్యం దోషా దోషా గుణా గుణాః ॥

దోషాల్ని గుణాలుగానూ గుణాల్ని దోషాలుగానూ (ఎవరో) వాది (తన వాదనా సామర్థ్యంతో) చూపించవచ్చు, కాని దోషాలు దోషాలే ! గుణాలు గుణాలే !

17. వ్రతే వివాదం విమతిం వివేకే సత్యేఽతి శంకాం వినయే వికారమ్ ।
గుణేఽవమానం కుశలే నిషేధం ధర్మే వివాదం న కరోతి సాధుః ॥

సజ్జనుడు వ్రత విషయంలో తగాదా పెట్టుకొనడు. వివేకం చూపేచోట వెనుదీయడు. ఉన్న (వస్తుస్థితి) విషయంలో అతి శంకని పెట్టుకొనడు (చూపడు). వినయాన్ని అపార్థం చేసుకొనడు. గుణాల్ని అవమానించడు. హితాన్ని నిషేధించడు. ధర్మంతో విరోధించడు.

18. న నరస్య నరో దాసో దాసశ్చార్థస్య భూపతే ।
గౌరవం లాఘవం చాపి ధనాధన నిబంధనమ్ ॥

ఓ రాజా ! నరుడు డబ్బుకే దాసుడుకాని నరుడు నరుడికి ఎన్నడూ దాసుడు కానేరడు. గౌరవాగౌరవాలు కలిమిలేములమీదనే ఆధారపడి ఉంటాయి.

19. వయోవృద్ధాస్తపోవృద్ధా జ్ఞానవృద్ధాశ్చ యే పరే ।
తే సర్వే ధనవృద్ధస్య ద్వారి తిష్ఠంతి కింకరాః ॥

వయోవృద్ధులూ తపోవృద్ధులూ జ్ఞానవృద్ధులూ ఇతర గుణవిశేషంవలన గొప్ప వారైనవారూ ధనవృద్ధుడి గుమ్మందగ్గిర కింకరుల్లా నిలబడి (అతని అనుగ్రహంకోసం) కాచుకొని ఉంటున్నారు.

20. యద్దదాసి విశిష్టేభ్యో యచ్చాశ్నాసి దినే దినే ।
తత్తే విత్తమహం మన్యే శేషమన్యస్య రక్షసి ॥

పాత్రత ఎరిగి దానం చేసినదీ, నువ్వు ప్రతి దినం తిన్నదీ ఇదే నీ ఆర్జనలో నీకు తిరిగి ముట్టేది అని నా అభిప్రాయం. ఈ రెండు గాకుండా ఏమైనా దాచేవా దానిని నీ అనంతరం ఇతరులకోసమే (కింకరుడిలా) రక్షిస్తున్నావు (తప్ప నీకోసం మాత్రం కాదు).

21. శతేషు జాయతే శూరః సహస్రేషు చ పండితః ।
వక్తా దశసహస్రేషు దాతా భవతి వా న వా ॥

నూటికో శూరుడూ, వెయ్యికో పండితుడూ, పదివేలలో ఒక వక్తా ఉండవచ్చు. కాని దాత (ఇంతమందికొకడుంటాడని చెప్పలేం) (ఎంతమందిలోనైనా) ఉంటాడో ఉండడో ?!

22. యది సంతి గుణాః పుంసాం వికసంత్యేవ తే స్వయమ్ ।
నహి కస్తూరికామోదః శపథేన విభావ్యతే ॥

మనుష్యుల మంచిగుణాలు స్వయంగానే వికసిస్తాయి (అందరికీ తెలుస్తాయి) కస్తూరీపరిమళం ఒట్టుపెట్టి ఎవరూ చాటనక్కరలేదుకదా!

23. ఉద్యమేన హి సిధ్యంతి కార్యాణి న మనోరథైః ।
నహి సుప్తస్య సింహస్య ప్రవిశంతి ముఖే మృగాః ॥

పనులు ప్రయత్నాలవల్లనే సిద్ధిస్తాయికాని కేవలం కోరికలవల్ల కాదుగదా! నిద్రపోతున్న సింహం నోటిలోకి లేళ్ళు స్వయంగా ప్రవేశించవు మరి.

24. పూర్వజన్మకృతం కర్మ తద్దైవమితి కథ్యతే ।
తస్మాత్ పురుషకారేణ వినా దైవం న సిధ్యతి ॥

పూర్వజన్మలో చేసిన కర్మనే ఈ జన్మలో దైవం అని అంటారు. కాబట్టి పురుషకారం లేకుండా దైవం ఏ కార్యంలోనూ సిద్ధిని కలుగజేయదు.

25. అమంత్రమక్షరం నాస్తి నాస్తి మూలమనౌషధమ్ ।
అయోగ్యః పురుషో నాస్తి యోజకస్తత్ర దుర్లభః ॥

ప్రతీ అక్షరమూ ఒక మంత్రమే! ప్రతీ వేరూ ఒక ఔషధమే! ప్రతీ వ్యక్తీ పనికివచ్చేవాడే! (అయోగ్యుడైన వ్యక్తి లేనేలేడు.) (అయితే) ఆయావస్తువుల

యోగ్యతలనుబట్టి తనకి పనికివచ్చేలా సమయసందర్భాలలో వాటిని మలచుకొనే వ్యక్తి మాత్రం చాలా అరుదు.

26. అల్పానామపి వస్తూనాం సంహతిః కార్యసాధికా ।
తృణైర్గుణత్వమాపన్నైర్బధ్యంతే మత్తదంతినః ॥

అల్పమైన వస్తువులైనా ఒకచోట సమూహంగా చేరి (ఎంతగొప్ప) కార్యాన్ని (అయినా) సాధించగలవు. గడ్డిపోచలు పెంటిగా ఏర్పడి మత్తగజాల్నే బంధించి వేస్తున్నాయి.

27. క్షమా బలమశక్తానాం శక్తానాం భూషణం క్షమా ।
క్షమా వశీకృతిర్లోకే క్షమయా కిం న సాధ్యతే ॥

ఓర్పు బలహీనులకి బలం. బలవంతులకి అది అలంకారం. ఈ లోకంలో ఓర్పే వశీకరణౌషధం. ఓర్పుతో సాధించలేనిదేది ?

28. ప్రియవాక్యప్రదానేన సర్వే తుష్యంతి జంతవః ।
అతస్తదేవ వక్తవ్యం వచనే కా దరిద్రతా ॥

ఇంపైన మాటలకి అందరూ సంతోషిస్తారు కనక అవే మాట్లాడడం మంచిది. మాటలకి దారిద్ర్యం ఎందుకు ?

29. విదేశేషు ధనం విద్యా వ్యసనేషు ధనం మతిః ।
పరలోకే ధనం ధర్మః శీలం సర్వత్ర వై ధనమ్ ॥

విదేశాలలో విద్య ధనం. కష్టాలలో తెలివితేటలు ధనం, పరలోకంలో ధర్మం ధనం. శీలం మాత్రం సర్వకాలసర్వావస్థల్లోనూ ధనమేనుమా !

30. అశ్వః శస్త్రం శాస్త్రం వీణా వాణీ నరశ్చ నారీ చ ।
పురుషవిశేషం ప్రాప్తా భవంతి యోగ్యా అయోగ్యాశ్చ ॥

అశ్వం, ఆయుధం, శాస్త్రం, వీణ, మాట, మనుష్యుడు, స్త్రీ వీటిని ఏ వ్యక్తి ఉపయోగిస్తాడో అతనినిబట్టి యోగ్యమైనవిగా గాని అయోగ్యమైనవిగా గాని పరిణమిస్తాయి.

31. హీయతే హి మతిస్తాత హీనైస్సహ సమాగమాత్ ।
సమైశ్చ సమతామేతి విశిష్టైశ్చవిశిష్టతామ్ ॥

నాయనా ! నీచుల సంపర్గచేత నీ బుద్ధి నీచంగానూ, సమానులలో సమంగాను విశిష్టుల సంసర్గతో విశిష్టంగానూ పరిణమిస్తుంది.

32. కల్పద్రుమః కల్పితమేవ సూతే సా కామధుక్కామితమేవ దోగ్ధి ।
చింతామణిశ్చింతితమేవ దత్తే సతాం హి సంగః సకలం ప్రసూతే ॥

కల్పవృక్షం, కామధేనువూ, చింతామణి కోరినమేరకే కోరికల్ని తీర్చగలవు. కాని సత్సాంగత్యం మాత్రం (కోరినవీ కోరికలకతీతమైనవీకూడా) సకలాన్నీ ప్రసా దిస్తుంది.

33. పాపాన్నివారయతి యోజయతే హితాయ
గుహ్యాని గూహతి గుణాన్ ప్రకటీకరోతి ।
ఆపద్గతం చ న జహాతి దదాతి కాలే
సన్మిత్రలక్షణ మిదం ప్రవదంతి సంతః ॥

పాప కార్యాచరణ నివారించడం, హితాన్ని సమకూర్చడం, రహస్యాల్ని దాచడం, ఉన్న సుగుణాల్ని ప్రకాశింపజేయడం, ఆపదలలో విడవకుండా కాపాడడం, అవసరం వచ్చినప్పుడు అదుకోవడం — ఇవి సన్మిత్రుడి లక్షణాలని పెద్దల అభిప్రాయం.

34. రహస్య భేదో యాచ్ఞా చ నైష్ఠుర్యం చలచిత్తతా ।
క్రోధో నిస్సత్యతా ద్యూతమేతన్మిత్రస్య దూషణమ్ ॥

రహస్యాల్ని బయటపెట్టేయడం, యాచన, కటు ప్రవర్తన, చలచిత్తత, క్రోధం, అబద్ధాలాడడం, జూదం — ఇవి మిత్రుడికి ఉండరాని లక్షణాలు.

35. యథాంభసి ప్రసన్నే తు రూపం పశ్యతి చక్షుషా ।
తద్వత్ ప్రసన్నేంద్రియవాన్ జ్ఞేయం జ్ఞానేన పశ్యతి ॥

తేరిన నీటి అడుగునఉన్న అన్ని వస్తువులూ కంటికి విశదంగా గోచరించినట్టే (అరిషడ్వర్గాదిక్షోభ లేని) ప్రసన్నేంద్రియవంతుడు జ్ఞేయాన్ని జ్ఞానంతో చూడగలడు.

36. జితేంద్రియత్వం వినయస్యకారణం
గుణప్రకర్షో వినయాదవాప్యతే ।
గుణాధికే పుంసి జనోఽనురజ్యతే
జనానురాగప్రభవా హి సంపదః ॥

జితేంద్రియత్వమే వినయానికి కారణం. వినయంవలననే సద్గుణసంపద కల్గు తుంది. సద్గుణసంపద ఉన్నవ్యక్తిని లోకం హర్షిస్తుంది. సకలైశ్వర్యాలూ లోకుల అనురాగంవల్లనే సిద్ధిస్తాయి.